# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 22 ఆగష్టు 1979 సంచిక 8

## విషయానుక్రమణిక



---

–: శ్రీవారి కార్యక్రమములు :–

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెఱువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

చందాదారులు గమనించండి!

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానినిగమనించి, ఆ నెంబరు "..../-9-1979" అనియుండిన, మీచందా సెప్టెంబర్ నెలతో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సంIIనకు రూ. 6) ఆగష్టు నెల 31 వ తేదీ 1979 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

సంవత్సర చందా 6 రూII గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను.
వివరములకు అటలోపలి భాగములో చూడండి.



ప్రణవో పాసనలో సాయి సద్గురు ప్రథమ శిక్షణ



# సత్యసాయి వాహిని

శ్రీ సత్యసాయిబాబా

జీవుడు ప్రకృతికి వశుడయి వున్నాడని కానీ ప్రకృతిలో జీవుడు కూర్చొని వున్నాడని కానీ గ్రహించనగును. ఇంతటి గంభీరార్థములుగల శాస్త్రములోని కర్మ విషయము ప్రస్తుతము వదలి మానవుల సామాన్య బుద్ధికి అందనటువంటియు, సంబంధించినటువంటియు నగు కర్మను గురించి కూడా ఒకింత తెలిసికొనవలసి యున్నది.

కర్మ అన సామాన్యముగ మనకందరికీ తెలిసిన అర్థము పని అని. యెట్టి వ్యవహారమునైననూ, వ్యాపారమునైననూ కర్మ అనవచ్చును. కర్మ యందు ఉచ్చ, నీచములు లేవు. ప్రతి కర్మను పూజ్య భావముతో జూచి, ఆచరించవలెను. కర్మ ప్రశంసా సూత్రములు అనేకములు. హిందువులు సామాన్యముగ కర్మ, కర్మ, కర్మ అని సర్వము కర్మకు, ప్రారబ్ధమునకు వదలి సోమరులై యున్నారని కొందరనుటయు తటస్థించుచున్నది. ఇది అపస్మారకపు లంకె. ఇది కర్మసిద్ధాంతమునకును లౌకిక కర్మకును ముడిపెట్టుట వలన సంభవించినది. ఇట్టి హెచ్చరికలు, హితబోధలు యెందులకో, యెవరిని వుద్దేశించియో మానవులకు తెలియదు. అయినను సాధారణముగ మన అనుభవములో గల వారిని చూడుడు. ఒక కచేరి యందు పని చేయు గుమాస్తా, భూమి దున్ని బ్రతుకు కృషీవలుడు, కాయ కష్టములు చేసి జీవించు కూలి, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, చాకలి, మంగలి మొదలగువారు తమ తమ విధ్యుక్త ధర్మము

లను యెరుగుదురు. యెవరి కర్మ వారు చేయకున్న తమ జీవితము సక్రమ మార్గమున నడువదని వారెరుంగుదురు. అందులకు వారి వారి శక్తియుక్తుల ననుసరించి తమ తమ కర్మలు వారు నెరవేర్చుకొనుచుండు సందర్భమున హెచ్చరికలు యేలకో? వారి వారి కర్మలు వారు నెరవేర్చుకొనలేని సమయముననే హెచ్చరికలు అత్యవసరము. మోహాంధుడై తన కర్తవ్యమేదో పాలుపోక విరక్తి భావముతో యుద్ధము చేయను అనిన అర్జునునకు శ్రీకృష్ణ భగవానుడు "కర్మణ్యేవాధికారస్తే" అన్నారు. అనగా కర్మనాచరించుటయే కర్తవ్యమని బోధించిన ఉపదేశామృత వాక్కులను కొందరు ఉదాహరించుటయు జరుగుచుండును. ఈ ఉపదేశములు కేవలము ధర్మ సంస్థాపనార్థము, శాస్త్రీయమైన కర్మమార్గమునందు ప్రవృత్తి కలిగి యుండుటకు మాత్రమే చేయబడినవి కానీ భౌతిక, పశు సామాన్య ధర్మములై ఆహార భయాదులకు సంబంధించినవి కావు. ధర్మరాజాదులు లౌకిక వ్యవహార ధురంధరులు. వర్ణాశ్రమాచార ధర్మ నిరతులై యున్నారు. ఇట్టి వారలకు యుద్ధము చేయుమని చేయు హితబోధ తాత్పర్యమేమి? అనేక కారణములను పురస్కరించుకుని యుద్ధము చేయను అను పార్థునితో నీవు క్షత్రియ వంశ జనితుడవు, క్షత్రియునకు వంశధర్మ మొకటి కలదు. అట్టి వర్ణ ధర్మము అగు యుద్ధమును విసర్జించి వ్యవహరింపకుము. మానవుడు ప్రకృతి గుణములకు వశుడై యున్నాడు. కావున యేదో ఒక కర్మ చేయుచునే యుండును. ఒక్క క్షణమైననూ కర్మ చేయకుండ వుండజాలడు. కావున దీనిని గ్రహించి నీ కులధర్మమును త్యజింపకుమని, చేసిన హిత బోధ యిది. కర్మ అనగా ఆహారాదులకు అనువగు కృషియనియేనా అర్థము? విమానములు, పడవలు, కర్మాగారములు, చికిత్సాలయములు ఆహారోత్పత్తి ప్రణాళికలు మాత్రమే కర్మ భాగమనరాదు, దీనిని కేవలము ఐహిక కర్మ యందురు. ఐహిక, ఆధ్యాత్మికములు దైవికమునకు జతపడి యున్నవి, ఇహలోక సుఖమునకు యిట్టి కర్మలన్నియు అనివార్యములు. ఇట్టి కార్యాచరణము నందెంతెంత లోపముండునో, అంతంత వ్యక్తి సంఘ దేశగత సుఖానుభూతి లోపించుచుండును. ఇందు రెండు అభిప్రాయములు వుండజాలవు. కాని ఐహికమున కిచ్చు ప్రాధాన్యము ఆముష్మిక కర్మకు కూడ నొసంగబడినచో మనము వగవ పనిలేదు.

ఐహిక కర్మలకును దైవికమునకును గల సంబంధము కూడ నొక్కింత పరికింతము. మనము పొలమును చక్కగ బలపరచి దున్నుదుము. మంచి విత్తనములను అందులో చల్లుదుము. దానిని సకాలములో నూడ్చుదుము, కలుపులు దీయుదుము, నీరు పెట్టుదుము, చక్కగా కంచెగట్టి, కాపలా కాయుదుము. యే కర్మకు ఆ కర్మ యథావిధిగా నుత్సాహ పూరితముగా చేయుదమనుకొనుడు. అంతటితో మన కర్మ ఫలితము నిరాటంకముగ మన యింటికి చేరునను నమ్మకమేమి? కాలువలలో నీరు లేమి వలననో లేక అతివృష్టి, అనావృష్టి వలననో, లేక రోగములు, తెగుళ్ళ వలననో పైరు నశించును. అట్టి నిరాశా పూరితకు మానవ జవసత్వమును చంపుకొనుట భావ్యము కాదు. వర్షములు కురియని పక్షమున వాయు

విమానముల సహాయమున అంతరిక్షముననో లేక వేరు మార్గముననో మేఘ మాలికలపై కెగిసి వానిపై మందులు ప్రయోగించి కృత్రిమ వర్షముల బలవంతముగ కురిపింతుమను కొనుము. ఆ వర్ష బిందువులు మన పొలము లోనే పడునను నిశ్చయమేమికలదు? ప్రభంజనుని ఆగ్రహ అనుగ్రహముపై ఆధారపడ వలసినదే కాని ఈ కృత్రిమ సృష్టిపై ఆధార పడ వీలుకాదు.

వేరొక మార్గము మృగ్యమైనపుడు గత్యంతరము లేక దేవుని ప్రార్థించ వలెనని తలంచిన యెట్లు ప్రార్థించవలెను? యేమని ప్రార్థించ వలెను? అవసరమునకు ప్రార్థించక తీరదు. అమాంతముగా ఓ దేవుడా! నా పొలములోని పైరులు వర్షములేక మల మల మాడిపోవు చున్నవి. కాలువలలో నీరు చుక్క అయిననూ త్రాగుటకైననూ లేకయున్నది. కాన త్వరలో వర్షము కురిపించుము. కాలువలలో నీరును ప్రవహింప చేయుము — అని ప్రార్థింతుమను కొనుము. మరొక సందిగ్ధావస్థలో బడుట తటస్థించుచున్నది. అదేసమయమున నీ పొరుగింటి యతడు తాను యేదియో మంగళ కార్యమును చేయబూని, ఆ కార్యము పూర్తి అగువరకూ వర్షము కురియకుండునటుల చేయుమని దేవుని దీనుడై ప్రార్థించును. ఈ విధముగా ప్రార్థనలు సలుపు ఇరువురూ దైవమునకు అత్యంత భక్తులే, పరమ భక్తులే కావచ్చును. వర్షము కావలయునని ఒకభక్తుడు, వర్షము అక్కర లేదని మరొక భక్తుడు ప్రార్థించుట వలన ఈ పరిస్థితియందు దేవుడు యేమి చేయవలయును? యెవరి కోర్కెను దేవుడు నెరవేర్చవలయును? ఈ కోర్కెలు నెరవేర్చుట దేవుని నియమమా? ఈ విధమైన కోర్కెలు భగవంతుడు యే విధమున నెరవేర్చును? దేవునకు సర్వ స్వతంత్రమున్ననూ కొన్నింటికి తాను కూడా బద్ధుడే కదా!

ఒక దేశమునకు రాజు, తాను ప్రభువును కదా అని తన దేశప్రజల కోరికలన్నియూ పూర్తిగా తీర్చ జాలకున్నాడు. తాను ప్రభువునని యిచ్ఛ వచ్చినట్లు చేయ బూనినచో ప్రజలు అతనిని పదవీ భ్రష్టుని చేతురు, చేయ వచ్చును. ఎందువలన? యెంత రాజైననూ సక్రమ పరిపాలన నిమిత్తము యేర్పడిన కొన్ని నియమములకు, చట్టములకు లోనై యుండవలయును. ఈ చట్టములు, తనచే నియమించబడినవైననూ అవి తనచే నియమించిన తరువాత తానునూ ఆ చట్టములకు బద్ధుడు అవుతాడు. కావలెను. వానిని తాను ధిక్కరించినా, మితిమీరి నడిచినా "యథారాజా తథాప్రజా" అను ధర్మము అమలులోనికి రాగలదు. అందువలన చట్ట నిర్మాత, చట్ట నియమములను అనుసరించి మెలగవలసి యుండును. వేరు మార్గమున పోవ వీలుపడదు. ప్రజల యోగక్షేమములను ప్రభువు చూచుకొనుట కర్తవ్యము. వారల క్షేమమే ప్రభుక్షేమము, కనుక వారల క్రమమైన కోరికలను తీర్చుట అతని విధ్యుక్త ధర్మము, అందువలన అందులకు రాజ్యాంగ తంత్రము ననుసరించి, సర్వ విషయములు స్వయంగా తనకు తాను నిర్వహించక, తన పాలనా విధానము సక్రమముగా, నడచిపోవుటకై వివిధ శాఖలను నియమించును.



# నేను నీవాడను

దివ్యాత్మ స్వరూపులారా !

కారణములేని కార్యము, ఆధారములేని ఆధేయము ఉండదన్న విషయము మీకందరికి తెలుసు. దుర్గుణములకు కానీ, సద్గుణములకు కానీ హృదయము నందు కొన్ని ఆధారములు ఉండటంచేతనే ఇవి ఆవిర్భవిస్తూ వస్తున్నాయి. అహంకారము, అసూయ, అవిశ్వాసము ఇలాంటి దుర్గుణములన్ని నేటి జన్మ యందు మనలను వెంటాడునవికావు. అనేక జన్మముల నుండి మనలను వెంటాడుతూనే వస్తున్నాయి. అప్పటి కప్పుడు ఈ కొమ్మలను కొట్టినప్పటికీ, వీని వేర్లు స్థిరముగా నిలచిపోవటంచేత, ఈ దుర్గుణత్వాన్ని మనం సంపూర్ణంగా నిర్మూలించుకోలేక పోతున్నాము. అయితే దీనికిక గతియే లేదా అనే బలహీనతకు మనము చోటివ్వనక్కరలేదు. ఈ వేర్లనుకూడా తీసివేసి, దుర్గుణములను పూర్తిగా హతమార్చేటటువంటి విధానము కూడ లేకపోలేదు. అహంకారము మొట్ట మొదటిదని భావిస్తున్నాము మనం, కానీ, ఈ అహం కారము ప్రథమస్థాయికి చేరినటువంటిది కాదు. కొంత మందికి ధనము చేతనో లేక బలము చేతనో, లేక జన బలము చేతనో, అధికార బలము చేతనో అప్పటికప్పుడు వచ్చేటటువంటి అహంకారములు తాత్కాలికమైనటువంటివి. ఇవి కూడ పూర్వము లేకుండ అప్పటికప్పుడు ఆవిర్భవించేటటువంటివికావు. ఇది ఏ రీతిగానంటే దీనికి చక్కని ఉదాహరణను భాగవతము నిరూపించుచు వచ్చింది. మొట్ట మొదటిది అభిమానము. ఇది మన రక్తముతో కూడి అనేక జన్మల నుండి మనలను వేధిస్తూ వస్తున్నది. ఈ అభిమానముతో మమకారముకూడ చేరుతూ వస్తున్నది. ఈ అభిమాన మమకారములు కూడటంచేతనే అహంకారం రూపొందుతూ వస్తున్నది. ఈ అభిమాన మమకార, అహంకారములచేతనే మనలో మోహము అనేటటువంటిది రూపొందుతూ వస్తున్నది. గోకుల వాసులు, గోపికలు, గోపాలురు కొన్ని విధములైన మార్గములను అవలంబిస్తూ వచ్చారు. ద్వారక వాసులు మరొక మార్గాన్ని అవలంబిస్తూ వచ్చారు. ఈ ద్వారక వాసులు శ్రీకృష్ణుని "కృష్ణుడు మావాడు", "మా అత్త కొడుకు", "మా మామ కొడుకు", "మా అన్న", "మా బావమరది", "మా సచివుడు" అనే భావముతో వుండేవారు. ఈ విధమైన అభిమానము వారిలో అభివృద్ధి చెందటంచేత క్రమ క్రమేణ అదియే ఒక మమకారముగా రూపొందుతూ వచ్చినది. ఈ అభిమాన మమకారములు రెండూ కూడిన తక్షణమే వారిలో మా కృష్ణుని కంటే గొప్ప వారున్నారా ? ఇతడు మావాడు. మా యాదవకులము నందు జ్యోతివలె వెలుగుతున్నాడు అనే అహంకారము సహజంగానే బయలుదేరింది. ఈ అహంకారము ఎప్పుడు ఈ యాదవులలో బయలుదేరెనో అప్పుడు అది ఆ యాదవకులమునకే ముసలముగా పరిణమించింది. ప్రమాదము సంభవించింది. అనగా అహంకారము ఎప్పుడు ముదిరిపోయెనో అప్పుడు అసూయ మానవునిలో ప్రజ్వరిల్లుతూ వస్తుంది తనయొక్క స్వార్థనిమిత్తమై, ఈ అహంకారాన్ని బలపరుచుకునే నిమిత్తమై, పోషించుకునే నిమిత్తమై ఇతరులను చూచి అసూయపడటం ఇది అహంకారము యొక్క పీడ. తనకంటే అధికులను చూచినా లేక తనకంటె సుఖ వంతులను చూచినా, బలవంతులను చూచినా, విద్యా

వంతులను చూచినా, తక్షణమే ఈ అహంకారము మొదలై అసూయ అనేటటువంటి రూపు ధరిస్తుంది.

ఈ అసూయ యాదవులలోపల మరింత బలపడి పోవడం చేతనే వారిలో వారికి కలహములు ఏర్పడుతూ వచ్చాయి. కట్టకడపటికి యాదవకులమే నాశనము కావించుకున్నారు. ఇంక గోకులవాసులైన గోపాలురు గోపికలు కృష్ణా! మేము నీవారము, మేము నీవారము అని అర్పితము గావించుకున్నారు. మేము నీవారము అని అనుకోవటంచేత కృష్ణుడు ద్వారక యందుండినా మధుర యందుండినా, ఇంకే ప్రదేశమందు ఉండినప్పటికిని గోపికల యొక్క క్షేమాన్ని తన లక్ష్యమందుంచుకొని, తన దృష్టియందుంచుకొని వారి యొక్క యోగక్షేమాలు విచారిస్తూ వచ్చాడు. కనుకనే గోకులవాసులు నిరంతరము సుఖసంతోషములతో కృష్ణచింతనచేత ఆనందాన్ని అనుభవిస్తూ కట్టకడపటికి కృష్ణునిలోనే లీనమవుతూవచ్చారు. వారియందున్న భక్తి ప్రపత్తులు వీరియందు లేక పోయినప్పటికి వారు చాలా వినయ విధేయతలతో కృష్ణచింతనయందే కాలం గడుపుతూ వచ్చారు కాని వారికి అహంకారము ప్రకటించుటకు కాని లేక అసూయను నిరూపించుటకు కాని ఏ మాత్రం అవకాశం లేకపోయింది. అనగా తనయొక్క దేహతత్వము అధికారతత్వము తాము విస్మరించటంచేత నిరంతరము తాము కృష్ణ చింతనలోనే నిత్యానందమును అనుభవిస్తూ వచ్చారు. వీరిలో యింతభక్తి ప్రపత్తులు ఉండినప్పటికిని, వీరి భక్తి ప్రపత్తులు లోక వ్యాప్తి చెందినప్పటికిని వీరిలో అసూయ అహంకారములు చేరకుండ పోవటానికి కారణమేమి? అనగా గోపికలు తాము తమవారిగా భావించలేదు. తాము భగవంతుని వారలుగా భావించారు. ఇక్కడ గోపికలకు, ద్వారకవాసులకు ఉండినటువంటి వ్యత్యాసమేమిటంటే కృష్ణుడు మావాడు అని అహంకారముచేత, మమకారం చేత, అభిమానంచేత పతనమైన వారు ద్వారక వాసులు. మేము నీవారము అని శరణాగతులై భక్తి ప్రపత్తులచేత సుఖ సంతోషములతో శాశ్వతమైన స్థానాన్ని చెందినటువంటివారు గోపికలు. కనుక ఈనాడు సాయి సంస్థలకు సంబంధించినటువంటి వ్యక్తులందరు కూడ మేము సాయివారలము, భగవంతుని సంతతికి సంబంధించిన వారలము అనే భావాన్ని ఎన్నాడు అభివృద్ధి పరచుకుంటారో ఆనాడే మనయందు అసూయకు కాని, అహంకారమునకు కాని ఏ మాత్రము అవకాశము వుండదు. నేను సాయి సంస్థలోపల సేవాదళ కన్వీనరు, సేవాదళ లీడరు, నేను సేవాదళ **Head** ఈ రకమైనటువంటి పదవి నిమిత్తమై, వ్యక్తియొక్క ఘనతకై అధికార ప్రాప్తికై అనేకరకములుగా మనం విర్రవీగటంచేతనే నేను అనే వ్యక్తిత్వము యొక్క శక్తిని మాత్రమే లక్ష్యము నందుంచుకోవటంచేత ఈ అహంకారము మరింత అభివృద్ధి కావటానికి ఒక అవకాశము ఏర్పడుతుంది.

నిన్నటి దినము చెప్పాను. దేశసేవచేసినటువంటి వారే దేశ నాయకులైనప్పుడు స్వార్థరహితమైన సేవ చేయుటలో ఎట్టి అభ్యంతరమూ ఉండదు. "దేశ సేవకుడైన స్వార్థరహితసేవ చేయగలడు. పదవి కాంక్షకలవాడు పరిశుద్ధ హృదయుడా?" కనుక మనం అధికారవిషయములో ఏ మాత్రము కూడ లక్ష్యము చేయక మన **Service** యందే, సేవయందే జీవితాన్ని అంకితం గావించుకోవటంచేత అహంకారమునకు ఏ మాత్రము అవకాశము ఏర్పడదు. అయితే ఇది అంత సులభమైనటువంటి పని కాదు. కాని మనము నిరుత్సాహముగా ఊరుకోకూడదు. తగిన ప్రయత్నం మనము చెయ్యాలి, "సాధనమున పనులు సమకూరు ధరలోన" చిన్న చీమ ప్రయాణము చేయటానికి ప్రయత్నించినపుడు కొన్ని మైళ్ళ దూరము కూడ

ప్రయాణము చేయగలదు. తనకు ప్రయాణము చేయటానికి యిష్టము లేనప్పుడు రెక్కలు కలిగినటువంటి గొప్ప పక్షి అయినా అర అంగుళము అయినా ముందుకు కొనసాగదు. కనుక శ్రద్ధకలిగినటువంటి చీమనే మైళ్ళ దూరము ప్రయాణము చేయగలిగినప్పుడు శ్రద్ధనే అభివృద్ధి పరచుకొనిన మానవుడు ఎట్టిదానినైన సాధించగలడు. మనయొక్క క్రోధమునకు కాని, అసూయకుకాని, అహంకారమునకు కాని మానసిక బలహీనత అధికం కావటం చేతనే ఇవన్నీ కూడ మనలో చెలరేగుతూ వస్తున్నాయి. దేహబలమునుకాదు, మనోబలమును అభివృద్ధి పరచుకోవాలి. ఈ మనో బలమును ఏ రీతిగా చేకూర్చుకోవాలంటే విశ్వాసము, గాఢమైన విశ్వాసము, మన సత్యసాయి సంస్థలపైన విశ్వాసము, సత్యసాయిపైన విశ్వాసమును మనము అభివృద్ధి పరచుకున్నప్పుడు ఈ దుర్గుణములకు ఏ మాత్రము అవకాశముండదు. ఈ దుర్గుణములు మనలో వుంటున్నాయంటే మనకు అంత గాఢమైన విశ్వాసము లేదని దీనికి అర్థము. కనుక మొట్టమొదట మనము చేసే కర్మలపైన, తలంచే తలంపులపైన గాఢమైన విశ్వాసాన్ని అభివృద్ధి పరచుకోవాలె. నేను ఒక సేవకుడను అనే భావముచేత మనము ఈ సేవలో ముందంజ వేయాలె.

మీ కందరికిని తెలుసు. మహాభారతంలో ఇట్టి బలహీనుడు ఎట్టివాడు అని పరీక్షచేసే నిమిత్తమై ఒకానొక సమయంలో కృష్ణుడు కౌరవులయందు ఒకరిని ఎన్నుకొన్నాడు. ఒకనాడు ఒకరికి ఒకరు తెలియకుండా తాను పరీక్షించటానికి పూనుకున్నాడు. కౌరవులయందు దుర్యోధనుని పిలిచి ఒకనాడు "దుర్యోధనా ! నాకు ఏదో ఒక ఘనకార్యము కావలసిన అవసరముండి వచ్చాను. నీవు నాకది చేసి పెట్టెదవా ?" అని అడిగాడు. తప్పక భగవంతుడే వచ్చి చేయడానికి నన్ను అడిగినప్పుడు నేను దీనిని కాదని చెప్పుదునా ? "తప్పక చేస్తాను", అని అహంకారము చేత వాగ్దాన మిచ్చాడు. నాకు ఒక ఉత్తమ చిత్తుడైన వ్యక్తితో అవసరమున్నది. పవిత్ర హృదయుడు, శాంత స్వరూపుడు నాకు అవసరంగా ఉంటున్నాడు అలాంటి వ్యక్తిని ఈ రాజ్యంలోపల ఎక్కడైనా వెతికి తేగలవా ? అన్నాడు. "తప్పక తేగలను" అని ఆనాడు రథంలో రాజ్యమంతా తిరిగాడు. ఎక్కడా విచారించలేదు. అహంకారికి విచారించే అవకాశము ఉండదు. తిరిగి వెనుకకు వచ్చాడు. "స్వామీ ! అట్టి ఉత్తముడైనటువంటి వ్యక్తి నాకీ రాజ్యములో ఎక్కడా కనిపించలేదు ఒక వేళ ఒకరో యిద్దరో ఉండినారంటే అందులో నేను మాత్రమే ప్రధానమైనటువంటి వాడను" అని అహంకారంగా తెలుపుకున్నాడు. "సరే అట్లయితే తరువాత నీతో కొంత అవసరముంది. తప్పక నిన్ను వినియోగించుకుంటాను" అని చెప్పి వెనుకకు వచ్చేశాడు కృష్ణుడు. తిరిగి పాండవుల దగ్గరకు వెళ్లాడు. "ధర్మజా! నీతో ఒక అత్యవసరమైనటువంటి పని ఉండటంచేత వచ్చాను. ఎవరైన నీ రాజ్యములో అతి నీచుడు, దుర్మార్గుడు, అసత్యవాది, అధర్మప్రియుడు ఉండిన తేగలవా ?" అన్నాడు. ఈధర్మజుడు వినయ విధేయతలతో తాను శిరస్సువంచి అన్ని ప్రదేశములలో వెదకి వచ్చాడు. అతని దృష్టిలో అందరూమంచి వారుగానే కనిపించారు. "స్వామీ ! నారాజ్యములో చెడ్డవారైన వారు ఎంతవెదకినా నాకు కనిపించలేదు. అంతో యింతో చెడ్డతనము నాలో ఉండవచ్చును కానీ నాప్రజలలో లేదు. ఆ చెడ్డవానిగా నన్నే నీవు స్వీకరించి నీయిష్టం వచ్చిన రీతిగా కావించుకొ"మ్మన్నాడు.కనుక ఈదుర్యోధనునకు ధర్మజునకు ఉన్న వ్యత్యాసం ప్రత్యేకంగా మనం విచారించినపుడు దుర్యోధనునిలో ఉన్నటువంటి అహంకారమే అతనికి మంచివారు కనబడకుండా పోవటం. ధర్మజుని

యందున్న వినయవిధేయతలే ఆతనికి పెద్దవారు కనబడకుండా పోవటం. కనుక ఈ మంచిపెద్దలకు మనయొక్క దృష్టిదోషము, మనోదోషములే మూల కారణం కానీ ప్రకృతి యొక్క దోషము కాదు. కనుకనే మొట్టమొదట మన యొక్క దృష్టిని, మన స్తత్త్వమును మనము వినయవిధేయతలుగా మార్చుకున్నపుడు అహంకారమునకు కాని, అసూయలకు కాని అవకాశం లేకుండా ఉంటుంది. ఇంతేకాకుండా ఇంకొక సులభమైన మార్గాన్ని మనం అవలంబించాలనుకుంటే సర్వజీవులయందు సర్వేశ్వరుడొక్కడే "నా ఆరాధ్యదైవము అందరియందూ ఒకడుగానే ఉంటున్నాడు" అనేటటువంటి తత్త్వాన్ని మనం అభివృద్ధి పరచుకుంటూ రావాలె. కనుక అందరియందు ఉన్నటువంటి భగవంతునిపైన మనం అహంకారం పూనటానికి ఏమాత్రం అవకాశం ఉండదు. అందరియందు ఉన్నటువంటి భగవంతుని అసూయతో చూడటానికి అవకాశం ఉండదు.

తమిళనాడులో తిరుప్పండ్ ఆళ్వారు అనేవారు ఉంటుండేవారు. అతడు ఒకనాడు శివాలయమునకు వెళ్ళి శివలింగముపైన కాళ్లు పెట్టుకుని చక్కగా నిద్రిస్తూ ఉండినాడు. తలుపులు తెరచి పూజారి లోపల ప్రవేశించాడు "ఎవరు ఈ పిచ్చివాడు ? దుర్మార్గుడు? దయాదాక్షిణ్యములు లేకుండ, భయభక్తులు లేకుండ భగవంతుని శిరస్సుపై పాదములుంచి పరుండినాడు !" అని క్రోధముచేత అతని పాదములు పట్టి లాగినాడు కాని అతడు ఎంత బలం ప్రయోగించినప్పటికీ ఆపాదములను నెట్టలేకపోయినాడు. అప్పుడు ఇతను కన్నులు తెరచి, 'నాయనా ! ఎందుకు నా పాదములు లాగుతున్నావు ?" అన్నాడు "ఒరే పిచ్చివాడా ! భగవంతుని యొక్క శిరస్సుపైన నీ పాదములు పెట్టటమా ? ఇది యెంత దుర్మార్గము ? కనుక నీపాదము ప్రక్కకు తీసుకోమన్నాడు. అప్పుడు తిరుప్పండ్ ఆళ్వారు చిరునవ్వు నవ్వుతూ "భగవంతుడు లేనిస్థానమేదో అచ్చట ఆపాదములు పెట్టు" మన్నాడు ఆపాదములు ఎత్తిక్రింద పెట్టాడు. అక్కడ ఒక శివలింగం వచ్చింది. మరి ఇంకొకచోట పెట్టాడు: అక్కడా ఒక శివలింగం వచ్చింది. మందిరమంతా పాదములు త్రిప్పాడు. ఎక్కడ చూచినా శివలింగం వచ్చింది. అప్పుడు ఈ తిరుప్పండ్ ఆళ్వారు ఆ పూజారికి చెప్పాడు "నాయనా ! నీయొక్క దృష్టి చాలా చిన్నది నీవు కేవలము సంకుచితమైన దృష్టితో ఉంటున్నావు" విశాలమైన దృష్టిని పెట్టుకున్నపుడు భగవంతుడు సర్వవ్యాపకుడు. కనుక ఈసర్వవ్యాపకుడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమయుడు అయిన భగవంతుని నీవు చిన్న రూపములో, చిన్నఫోటోలో చిన్న విగ్రహాలలో ఆరాధన చేస్తున్నావు. నీవే భగవంతునికి చాలా ద్రోహం చేస్తున్నావు" అన్నాడు. ఈ విధమైన ప్రబోధలు విన్న తక్షణమే ఈపూజారికి కనువిప్పు కలిగింది.

ఇదే విధముగనే మన ప్రాచీన మహర్షులంతా దివ్యత్వమైన సర్వవ్యాపకతత్వాన్ని గుర్తించుకుని వారివారి అహంకారాన్ని అణచుకోగలిగారు. ఇంక అసూయాతత్త్వమనేది కూడ మీకు తెలుసు. వసిష్ఠ విశ్వామిత్రుల మధ్యనున్న అసూయ పెద్దచరిత్ర. ప్రపంచమందున్న రాజాధిరాజులందరు, చక్రవర్తులందరు వసిష్ఠులవారిని "బ్రహ్మర్షి, బ్రహ్మర్షి" అని పిలిచేటటువంటివారు. అనేక సంవత్సరములు తపస్సు ఆచరించినప్పటికిని, ప్రత్యేకమైన సృష్టి తాను చేసినప్పటికిని విశ్వామిత్రుని ఎవరు చూచినను "రాజర్షి, రాజర్షి" అని పిలిచేటటువంటివారు. కానీ ఈ విధమైన పదములచేత విశ్వామిత్రునిలో అసూయ మరింత పెరిగిపోయింది. నేను ఏనాడు బ్రహ్మర్షి అనే సార్థకనామాన్ని అందుకోగలను ? అనే విషయమై లోపల పట్టుపట్టాడు. ఈ అసూయ క్రమక్రమేణా

ముదిరిపోయి ఒక దుర్మార్గస్థితికి వచ్చినది. ఈ జగత్తులోపల అందరూ నన్ను రాజర్షి అంటున్నారు. ఒక్క వసిష్ఠుల వారు ఉండటంచేతనే అతనిని బ్రహ్మర్షి అంటున్నారు. ఇక్కడ "రాజర్షి," అనటం చేత వ్యాఖ్యానం మనకు గోచరిస్తున్నది. ఈ బ్రహ్మర్షియైన వసిష్ఠులవారిని హతమార్చినపుడు ఇంకొక బ్రహ్మర్షి అనేవారు ఉండరు కనుక అపుడు నా పేరే ఘనంగా ఉంటుంది అనే దుర్బుద్ధికి పునాదివేస్తూ వచ్చాడు.

ఒక పౌర్ణమినాడు వసిష్ఠుడు చల్లని, చక్కని వెన్నెలలో అరుంధతితో ఒక గుట్టపై కూర్చుని ఉండగా అతనిని ఏవిధంగానైనా హత మార్చాలని విశ్వామిత్రులవారు చక్కని ఖడ్గమును తీసుకొని వెళ్ళి ఆ కొండ దగ్గరలో ఒక పొదలో దాగి ఉన్నాడు. అతని శిరస్సును ఖండించడానికి అన్ని విధాల విశ్వామిత్రుడు సంసిద్ధంగా ఉంటున్నాడు. ఈ సమయములో వసిష్ఠ అరుంధతులు సంభాషించు కుంటున్నారు. అరుంధతి, "ఈనాడు పూర్ణపౌర్ణమి. చంద్రుడు ఎంత తెల్లగా, ఎంతచల్లగా ప్రకాశిస్తున్నాడో ఇంత పరిశుద్ధమైన పూర్ణిమను నేనెన్నడూ చూడలేదు కదా !" అన్నది. వసిష్ఠుడు, "అవును అరుంధతీ ! ఈ పవిత్రత, చల్లదనము, ఈ పరిశుద్ధత, విశ్వామిత్రుని తపశ్శక్తివల్లనే" అన్నాడు. ఈ మాట వినే టప్పటికి విశ్వామిత్రుని హృదయము చాలా మార్పు చెందినది. " ఈ వసిష్ఠులవారిది ఎంత గొప్ప హృదయము! భార్యలవద్ద నిజమైన సత్యాన్ని నిరూపించటం పురుషుల లక్షణం. అలాంటిది నాతపశ్శక్తిని భార్యవద్ద ఎంతగొప్పగా వర్ణిస్తున్నాడు నాదే దుర్మార్గము" అని ఆకత్తిని పారవేసి, పరుగెత్తుకొని వచ్చి వసిష్ఠుని పాదములపై పడినాడు. ఈ దృశ్యమును చూచివసిష్ఠులవారు "బ్రహ్మర్షిలెమ్ము" అన్నాడు. విశ్వామిత్రునికి ఎంతో ఆశ్చర్యం కలిగింది "ఇంత కాలము ఇంత తపశ్శక్తిని సంపాదించినప్పటికినీ నన్ను రాజర్షి అని పిలిచిన వసిష్ఠుడు ఈనాడు నేను దుర్మార్గమునకు పూనుకున్నపుడు 'బ్రహ్మర్షి' అని పిలుచుటలోగల అంతరార్థమును అడిగి తెలుసు కోవా"లనుకున్నాడు. అప్పుడువసిష్ఠుడు 'విశ్వామిత్రా!' ఇంతకాలము నీ నఖశిఖ పర్యంతము అహంకారంనిండి ఉండినది. నీవు ఎవరికీ తలవంచేవాడవు కాదు. లొంగే టటువంటి వాడవు కాదు. ఈ విధమైన అహంకారము చేత నీవు స్వేచ్ఛావిహారము సలుపుతూ వచ్చావు. ఈనాడు నీ శిరస్సును వంచి, లొంగినట్లుగా పాదా క్రాంతుడవైనావు. ఇప్పటినుంచి నీవు బ్రహ్మర్షివి" అన్నాడు. దీని అంతరార్థమేమిటి ? అహంకారముతో ఉండినంతవరకు, అసూయ అనేది అన్ని విధాల హింసిస్తూ ఉంటుంది. ఏనాడు అహంకారము పోయి వినయవిధేయతలతో ఉంటామో ఆనాడు మనపేరు ప్రతిష్ఠలు వ్యాప్తికావటానికి అవకాశం ఉంటుంది. అహంకారంతో ఉండటంచేత అతనిని రాజర్షి అన్నారు రజోగుణ సంపత్తిగలవాడు రాజర్షి. మహారాజుఅనగా ఏమిటి ? రాజులు రజోగుణము కలవారు కనుక 'రాజులు' అన్నారు. కనుక ఏనాడు ఈ రజోగుణము పోయి, సాత్త్వికలక్షణములయిన వినయవిధేయతలతో ప్రవర్తిస్తామో, ఆనాడు పవిత్రత మనకు ఏర్పడుతుంది. క్రమక్రమేణా మనము వినయ విధేయతలతో ప్రవర్తించడానికి ప్రయత్నిస్తే మన హృదయానికి యీ అహంకార, అసూయలు సాధ్యమయినంతవరకు దూరము చేయడానికి అవకాశం ఉంటుంది. ఒక చిన్న ఉదాహరణ మన సేవాదళం వారు అనేక బహిరంగ సమావేశములలో కానీ, గుంపుగా జనం చేరినచోట్ల గానీ అనేక సేవలు చేస్తుంటారు. తాను సేవాదళ స ం కదా అని ఒక badge వేసుకుని ఉండుట చేత ఒక అహంకారముతో-ఇక్కడ కూర్చో, అక్కడ కూర్చోవద్దు అని వారిపైన జబర్దస్తీచేయడానికి కొంత అవకాశం ఉంటుంది. నీవువేసిన badge అహంకారాన్ని

దూరం చేసేదేకానీ, ఇనుమడింప చేసేది కాదు. వచ్చిన ప్రేక్షకులకు ప్రజలకు నీవు సాధకుడవు, సేవకుడవుకానీ నీవు అధికారివి కాదు. ఒక ఇంటిలో సేవకుడు యజమానిపై అధికారం చెలాయించినపుడు యజమానికి ఎట్లుంటుందో నీవు యోచించు. మనము వచ్చేవారికి సేవచేయడానికి ఉంటున్నాము. మనము సేవకులుగా ఉంటుండ, వచ్చినవారిపై అధికారం చెలాయించడానికి ప్రయత్నిస్తే మన అధికారాన్ని మనం కోల్పోతాము ఎదుటివారు ఒకవేళ మన సమావేశములో అత్యంతతరములు కలిగిస్తూ, అడ్డుతగులుతుంటే వారికి మొట్టమొదట నమస్కరించాలె. వారికి మంచి మాటలతో ఇక్కడ కూర్చో, కొంచెం జరిగితే అందరికీ వీలుగా ఉంటుందని చెప్పడానికి ప్రయత్నించాలి. అయితే కొంతమంది మూర్ఖంగా ప్రవర్తిస్తుంటారు. ఇలాంటి సమయంలో మనం కూడ కొంచెం మూర్ఖంగా ఉండవలసి వస్తుంది.

ఇటువంటి సమావేశములకు భక్తులు స్వామిని చూడాలనే అపేక్షచేత, ఏమీ తెలియక పోవటంచేత, మధ్యలోనిల్చుకొనటం జరిగినప్పుడు, వారి చీరలుపట్టి లాగటము వంటి అమర్యాదరీతిలో ప్రవర్తించకూడదు. అహంకారాన్ని మనం మొదట ఈ చిన్న చిన్న సేవలయందే పోగొట్టుకుంటూ రావాలి. మహిళా విభాగం, బాలవికాస్, భజన మండలి కానీ పబ్లిక్‌తో ఎక్కువ సంబంధము కలిగి ఉండవు. కానీ సేవాదళం వారికి అన్ని రంగముల వారితో పరిచయం ఉంటుంది. భజనవాళ్లు ఒకచోట కూర్చుని భజన చేస్తుంటారు. మహిళావిభాగంలోని ఆడవారు వారు విడిగా ప్రత్యేకమయినటువంటి కృషి చేస్తుంటారు. బాలవికాస్ వారి కార్యక్రమాలకు బాలబాలికలతో సంబంధం ఉంటుంది. కానీ సేవాదళం వారు మహిళా విభాగం కార్యక్రమమైనా, బాలవికాస్ కార్యక్రమమైనా, పబ్లిక్ కార్యక్రమమైనా అక్కడ చేరుతారు. సేవాదళంవారు అన్నిరంగములలో సన్నిహితంగా ఉంటారు కనుక వీరు మరింత జాగ్రత్తగా ఉండాలె. సత్యసాయి యొక్క పేరు ప్రతిష్ఠలు జగద్వ్యాప్తి కావాలంటే, సేవాదళం వారి ప్రవర్తన ద్వారా అధికం కావటానికి అవకాశం ఉంది. కారణమేమనగా అనేకరకములవారు నాస్తికులు, ఆస్తికులు, భక్తులు వస్తారు. అన్ని రంగములవారు చేరటం చేత సత్యసాయి సేవాదళం వారి ప్రవర్తన సరిగ్గా ఉంటే "సత్యసాయి సేవా సంస్థల శిక్షణ ఎంత బాగున్నది!" అని వారు కూడ చేరటానికి లేదా అంగీకరించటానికి కొంత అవకాశం ఉంటుంది. అట్లుకాకుండా మనసేవాదళం వారు అన్నిటికి అతిగర్విస్తూ, మాకు అధికారంగా ఉండాలని ప్రయత్నం చేస్తే వారు, "ఏమిటిరా? సాయిబాబా ఎంతో శాంతముగా ఉంటున్నారు. సేవాదళం వారు మేము అక్కడికి పోయిన క్షణమే, మహా యమదూతల మాదిరి మమ్మల్ని బాధ పెడుతున్నారనే పేరును మాత్రం తేకూడదు. కనుక కొంత వరకు కార్యకర్తలు అవిధంగా ప్రవర్తించే వారిని ఖండించాలె. కేవలము దేహరీతిగా కృషి చేయటమే కాక వాక్కునందు కూడా మృదు మధురమైన పదము లనే మనం ప్రవేశపెట్టాలె. "అయ్యా! స్వామి దర్శనం సాయంకాలం అవుతుందా?" అని వాలంటీరును అడిగితే "పో, పోవయ్యా! నాకు తెలీదు" అని చెప్పకూడదు. "నాకు తెలియదు సార్, విచారించి చెప్తాను" అని మంచి మాటలతో చెప్తే వారికెంతో శాంతి కలుగుతుంది. వారి హృదయాలెంతో చల్లబడుతాయి. అందుకే ఎప్పుడూ చెప్తుంటారు. We cannot always oblige, but we can speak always obligingly". నీవెంత మధురంగా మాటలాడితే మనసంస్థలు అంత అభివృద్ధి చెందుతాయి. కనుక ఈ విధమైన, బహిర్ముఖమైన ప్రవర్తనచేత కొంత అహంకారమును, అసూయను చల్లబరచుకున్నపుడు మంచిమంచివారు మన సంస్థలలో చేరడానికి అవకాశం

ఉంటుంది. ఇది రెండవ ప్రశ్నకు జవాబు.

కారణమేమనగా అనేకమంది సత్యసాయి సంస్థలలో చేరినను, వారి ప్రవర్తనలో, వారి అలవాట్లలో ఏమాత్రము మార్పులేకుండ ఉండటంచేత మిగిలిన వారు, వీరిలో ఏం మార్పు వచ్చింది? వీరిలో ఏగుణాలుంటున్నాయి? మారకుంటే ఏమి ప్రయోజనము? అని నిరుత్సాహం కలిగి, హాస్యాస్పదంగా భావించి, ఈ సంస్థలకు దూరంగా నిలుస్తున్నారు. ఒక చిన్న ఉదాహరణ. Bangalore సత్యసాయి Collegeవిద్యార్థుల ప్రవర్తనవలన వారి తల్లిదండ్రులంతా "అబ్బా! ఈ పిల్లవాడు మన ఇంటి దగ్గర ఎట్లా ఉండేవాడు? సత్యసాయి కాలేజీలో చేరిన తరువాత ఎంత మారి నాడు?" అని ఆ మార్పును, ఆధారం చేసుకుని అనేక మందిని చేర్చటానికి ప్రయత్నిస్తున్నారు. అదేవిధంగా మన సత్యసాయి సేవా సంస్థలలో చేరిన తరువాత మనకు పూర్వమున్నటువంటి దుర్గుణములు, దురాలోచనలు, దురభ్యాసములను దూరము చేసుకొని, సదభ్యాసములచేత మనము సద్వినియోగము చేసుకున్నామంటే దీనిని ఆధారం చేసుకొని అనేక మంది ఈ సేవా సంస్థలలో చేరడానికి అవకాశం ఉంది. అంతేగాని మీరు మా సత్యసాయి సేవాదళములో చేరండి అని force చేస్తే లాభం లేదు. మన ప్రవర్తన, మన స్వభావము, మన శీలము సరియైన రీతిలో ఉంటున్నప్పుడే దానిని ఆధారం చేసుకొని అనేకమంది మంచివారు చేరుతారు. మనము సేవాదళ సభ్యులుగా చేరినప్పటికీ, కార్యకర్తలుగా ఉండినప్పటికీ మనము Smoking, Drinking వంటి దురభ్యాసములతో మన కాలాన్ని వ్యర్థం చేసుకుంటుంటే, మనలను చూచి ఎవరు ఈ సంస్థలలో చేరుతారు? నీవు చేరితే నీలో ఏమి మార్పు చెందావు ? ఇకవారు చేరి ప్రయోజన మేమిటి! నీవు మంచిగా ఉన్నప్పుడే మంచివారు చేరే అవకాశమున్నది కనుక మంచివారు చేరాలనే ఉద్దేశమున్న వ్యక్తులు మంచివారు కావాలని ఆశిస్తున్నాను.

కనుక రెండవ ప్రశ్న అయిన మంచి వారంతా మన సంస్థలలో చేరడానికి ఏవిధమైన మార్గాన్ని అవలంబించాలె ? అంటే మొదట మీరు మంచిగా ఉండండి. మంచివారు చేరుతారు అని సమాధానము.

ఇటువంటి సమావేశములు జరుపుకొని, కాగితములపై వ్రాసి ప్రయోజనం లేదు. కార్యాచరణలో పెట్టాలి. పూర్వము తెలిసియో, తెలియకయో జరిగింది జరిగి పోయింది. కార్యకర్తల యొక్క కర్మలు సరియైన విధంగా నిర్వర్తించి, సేవాసభ్యులను అధిక సంఖ్యలో కూర్చుకొని, యావద్భారత దేశమునందేకాక, యావత్ప్రపంచమునందు మనసేవా సంస్థల కీర్తిని వ్యాపింపజేస్తారని ఆశిస్తూ ఆశీర్వదిస్తూ నాప్రసంగాన్ని ముగిస్తున్నాను.

సేవా దళ కన్వీనర్ల ట్రైనింగ్ క్యాంప్
సందర్భమున
శ్రీవారి దివ్య సందేశం

# నిష్కామకర్మ

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి దివ్యపర్యవేక్షణలో శ్రీ సత్యసాయి సెంట్రల్‌ట్రస్ట్ ఆధ్వర్యవమున ప్రతియేట నడుపబడు వేసవి తరగతుల సందర్భములో మే 21 వ తేదీనుండి 25 వ తేదీవరకు శ్రీ సత్యసాయి సేవాదళ్ రాష్ట్ర, జిల్లా కన్వీనర్లకు ప్రత్యేకమైన Training Camp నిర్విహింపబడింది. దీనికి భగవాన్ ప్రారంభోత్సవం చేశారు.

వైట్ ఫీల్డ్ సందలి శ్రీ సత్యసాయి కళాశాల ఆడిటోరియంతో ఈ సభకు ప్రారంభోత్సవం జరుపబడింది. శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థులు వేద పఠనంతో ప్రార్థన జరిపేరు. తర్వాత స్వాగతోపన్యాసంలో డా॥ కే. యం. మిస్త్రీ "ఎన్నాళ్ళగానో ఎదురుచూస్తున్న ఈ ట్రెయినింగ్ కార్యక్రమం భగవానుని కృపవల్ల నేటికి రూపం దాల్చింది. భగవాన్ దీనికి ప్రారంభోత్సవం చెయ్యడం మనఅదృష్టం. నిత్యమూ ఈ సమావేశ ప్రారంభమున భగవాన్ విచ్చేసి స్వయముగా మన కున్న సందేహములను తీర్చుటకు దయతో అంగీకరించుట మవ మహద్భాగ్యము. ఈ సదవకాశమును సద్వినియోగం చేసి కొని సేవాసాధన యందు పురోగమించురీతిని సేవాదళమును రూపొందించుదురనీ, తద్వారా భగవానుని అనుగ్రహమునకు పాత్రులవుదురనీ" ఆశా భావమును వ్యక్త పరచెను.

తదుపరి డా॥ వి. కె. గోకాక్ సేవ యొక్క అంతరార్థమును వివరించుచు ఉపన్యసించేరు. సత్యసాయి సంస్థలలో సేవాదళ్ సేవకు అంకితమైన ముఖ్య విభాగమన్నారు. వివేకము, శాంతి, ప్రేమలను అభివృద్ధి పరచుకొనుచూ ఈ సేవల ద్వారా తోడి మానవులందు హృదయ పరివర్తనం తీసుకురావడమే సేవాదళ లక్ష్యం అన్నారు. ఈశోపనిషత్తులో 'పరిహు' అనే పదమునకు పరస్పర ఆత్మసంబంధమును అనుభవతీత్యాగ్రహించినవాడని అర్థమని, సేవాదళ్ సభ్యులు కూడా, మానవసేవకు అంకితమై ఆస్థాయిని చేరాలని అన్నారు.

తదనంతరం భగవాన్ తమదివ్యోపన్యాసము నందించేరు.

(Swamiji's discouse enclosed)

# శ్రీ సాయిరాం

దేశసేవకుండె దేశనాయకుడైన
స్వార్థరహిత సేవ సలుపగలడు
పదవి కోరు వాడు పరిశుద్ధ హృదయుడా!
చెప్పరయ్య మీరు ఒప్పుకొనెద.

పవిత్రాత్మస్వరూపులారా!

కర్మయొక్క రహస్యాన్ని చక్కగా గుర్తెరిగిన దేశము ఈ భారతదేశము. కనుకనే ఈ పవిత్ర భూమికి కర్మక్షేత్రమని కూడ పేరు. ఆత్మాభిమానముతో చేసిన కర్మ జీవితము నాదరిస్తుంది. ఈ కర్మ యొక్క పవిత్రతను గుర్తించుటకు చిత్తశుద్ధి కావాలి. కర్మ నిరంతరము ప్రవహించే నదివంటిది. ఈ కర్మ యందు సృష్టి యందలి చేతనాచేతనములన్నియు పరిభ్రమిస్తున్నవి. కర్మతత్త్వాన్ని మనం గుర్తించుటలో అతిశ్రద్ధను వహించాలి. 'కర్మ' అనే పదము అతి చిన్నదిగా గోచరించినను దాని అర్థ బాహుళ్యము అమోఘంగా, అనంతంగా ఉంటున్నది. ఈ కర్మ హృదయాన్ని విశాలం చేస్తుంది. చైతన్యాన్ని వికసింపజేస్తుంది. ఈ పవిత్రమైన కర్మ అహంకారాన్ని నిర్మూలం గావిస్తుంది. ఆత్మానందాన్ని చేకూరుస్తుంది. కర్మ ఇట్టిది అట్టిది అని నిర్ణయించుటకు వీలుకాదు. ఈ కర్మకు ఆద్యంతాలు లేవు. కావున తత్త్వము ఎట్లు అనాదియో, ఈ కర్మ కూడ అట్లు అనాదియే. ఎవరు ఎక్కడ ఏ కర్మను ఆచరించిరో ఎవ్వరు చెప్పలేరు. కనుక కర్మ తత్త్వము అతిరహస్యంగా గుర్తించడానికే వీలవుతుంది. సామాన్యంగా లోకరీతిగా కర్మ అనగా - ఏదో ఒక పని చేయటం అని అర్థం. కానీ ఇది సరియైన అర్థంకాదు. దీనికి చిన్న ఉదాహరణ. "అతను ఏం చేస్తున్నాడు?" అన్న ప్రశ్నకు "అతను వ్రాసుకుంటున్నాడు" అని జవాబు చెప్తాము. ఈ వ్రాసుకోవడం ఒక కర్మ కనుక దీనిని మనం 'కర్మ'గా భావిస్తున్నాము. మరొక ప్రశ్న. అతడు ఏం చేస్తున్నాడు? అంటే 'అతడు ఏమీ చేయటంలేదు. అతను చూస్తున్నాడు' అని జవాబు చెప్తాము. కానీ అతడు చూస్తున్నాడు అనే పనిని చేస్తున్నాడు కనుక చూచుటకూడ ఒక కర్మ. నిద్రించుట ఒక కర్మ. ఊరక యోచించుట కూడ కర్మయే. మానవుని యందు ఉచ్ఛ్వాస నిశ్వాసము లుండినంత వరకు కర్మాచరణ తప్పదు. కర్మను విసర్జించుటకు వీలు లేదు. మానవుని ఉచ్ఛ్వాస నిశ్వాసములుకూడ ఒక కర్మయే. మన ఉచ్ఛ్వాస నిశ్వాసములకు ఎట్టి ప్రయత్నము లేక కర్మ సాగిపోతూ ఉంటుంది. దీనికి ప్రత్యేక పరిశ్రమ చేయ నక్కరలేదు. అటులనే మన నిత్య జీవితములో తెల్లవారినదిమొదలు రాత్రి పరుండునంతవరకు చేసే కర్మలకు మనకు ఏ విధమైన పరిశ్రమ అనవసరం. కనుకనే ఈ కర్మలన్నియు జీవితమునకు అంకితమైనవి. ఇవి పారమార్థికమునకు చెందినవి కావు. ఈ కర్మలలోని నిష్కామ కర్మను మనం చేపట్టాలి. వ్యక్తులకు సేవచేయటము, ఆస్పత్రులలో రోగులకు సేవచేయటము, దీనులకు, దిక్కులేనివారికి సహాయము చేయటము, నారాయణ సేవచేయటము ఇవన్నియు మన జీవితములో అంకితమైన సామాన్య కర్మలు. ఇవన్నియు నిష్కామ కర్మకు సంబంధించినవి కావు.

మానవుడు ఈ ప్రపంచమును స్వార్థంనిమిత్తము ప్రేమిస్తున్నాడు. ప్రతి పదార్థాన్ని స్వప్రయోజన నిమిత్తమై ప్రేమిస్తున్నాడు ఒక ఉదాహరణ. ఒక పండును మనం ప్రేమిస్తున్నామంటే పండునిమిత్తమై ప్రేమించుటలేదు. తన నిమిత్తము పండును ప్రేమిస్తున్నాడు. ఒక పదార్థాన్ని మనం అతిభద్రంగా దాచి పెట్టుకున్నామంటే ఆపదార్థము యొక్క ప్రేమ కోసం కాదు. మన ప్రేమకోసమై, పదార్థాన్ని భద్ర పరుస్తున్నాము. ఈ సుత ప్రపంచంలో అన్నిరకములైన ప్రేమలు కూడ స్వప్రయోజన నిమితమైన ప్రేమలు తప్ప, యథార్థమైన ప్రేమలు కావు. కనుక ఈ స్వప్రయోజనమైన తత్త్వాన్ని విసర్జించి, ప్రయోజమైన పరతత్త్వాన్ని మనం వరించటం, స్వార్థ రహితమైన సేవనే భావించటం, ఇది సేవాదళ సభ్యుల ప్రధాన కర్తవ్యం.

మానవుని ప్రతి ఆలోచన కూడ అతని జీవితంలో ఒక ముఖ్యమైన పాత్రను వహిస్తుంది. కనుక మానవుడు పవిత్రభావములనే హృదయములో ఉంచుకోవాలి. ఎట్టి భావములో అట్టి భవిష్యత్తుగా రూపొందుతుంది. మానవుడు అనగా భావాల పంట అని అర్థం. కనుకనే మనము ఈ స్వార్థరహితమైన భావాలు హృదయంలో చేర్చుకొనుటచేత ఇదియే నిష్కామ కర్మకు కొంతవరకు పురికొల్పుతుంది. నిష్కామ కర్మ మానవుని యందలి పశుత్వాన్ని నిర్మూలనంచేసి దివ్యత్వాన్ని ప్రసాదిస్తుంది. కేవలము ధ్యాన, జప, భజనాదుల వంటి కర్మలకంటే సేవయే పవిత్రమైనది. ఈ ధ్యానము, యోగము, జపము, భజన- స్వార్థం నిమిత్తమై, మానసిక శాంతికోసము ఆచరిస్తాము. పుణ్యం కోసము, పరార్థం కోసము ఆచరిస్తాము. ఇవన్నీ స్వార్థానికి సంబంధించినవి. ఇది పదార్థముల యొక్క సమ్మిశితము. కానీ మనం ఆశించవలసినది పరార్థ సంయోగము. పరార్థ సంయోగనిమిత్తమై ఆచరించవలసిన కర్మ స్వార్థ రహితంగా ఉండాలి. నిష్కామ కర్మ ప్రేమయొక్క పరిమళ పుష్పము. ఇట్టి పవిత్రమైన పరిమళం గల పుష్పంగా మన హృదయాన్ని మార్చుకోవాలి. నిష్కామ కర్మ అనే దానికి ప్రత్యేకమైన విశిష్టత వుంది. ఈ నిష్కామ కర్మ అనేదానిలో మన తృప్తి నిమిత్తమై. సేవను చేయించుకునే వ్యక్తి యొక్క తృప్తి నిమిత్తమై మనం యోచించరాదు "సాజన్మ యొక్క విశిష్టత ఇది" అనే విశ్వాసంతో ఆచరించాలి. ఈ నిష్కామ కర్మ నిమిత్తమై జన్మము ఆవిర్భవించినదని విశ్వసించాలి. ఈ నిష్కామ కర్మ మన నరములలో, కండరములలో, హృదయములో ప్రవేశించాలి. ఏది చేసినా పరమాత్మ పవిత్ర తృప్తి నిమిత్తమై ఆచరిస్తున్నామని "సర్వ కర్మలు భగవ త్ప్రీత్యర్థం" అని ఆచరించాలి నేను ఏదో సత్య సాయి సేవాదళం కన్వీనర్‌గా ఉంటున్నాను. **State President** గా ఉంటున్నాను. వారు నియమించే నియమాలను నేను ఆచరించాలనే, ఆ నిర్బంధముల గురించి యోచించ వద్దు. మన యొక్క **rules, regulations** విచారణచేయక హృదయ పవిత్రతకై, చిత్తశుద్ధి నిమిత్తమై మనం ఆచరించుటకు ప్రయత్నించాలి. మన సేవాదళంయొక్క చిహ్నమునందు **"Duty is god"** అని వ్రాసి ఉన్నది. అయితే ప్రతి మానవుడు, యావత్ ప్రపంచమున **Duty Duty** అనే పదం మాత్రమే ఉపయోగిస్తున్నారు. ఈ **Duty** అనే పదంలో ఉన్న అంతరార్థాన్ని గుర్తించటం లేదు. ఈ **Duty** అనే పదానికి ఒకే వ్యక్తిగా వున్నప్పుడు ఏమాత్రం విలువవుండదు. ఒక **society** ఒక సంఘము. ఇరువురు వ్యక్తులు ఉన్నప్పుడే **Duty** అను పదం ప్రయోగించటం అర్థవంతమవుతుంది. ఒక సమాజంలో మనం ఉంటున్నామనే అంతరార్థాన్ని గుర్తింపజేసేదే **Duty**. ఈ **Duty** అనేది వ్యక్తిగత **Duty** గా భావిస్తున్నాము. ఇక్కడ రెండు ముఖ్యమైన పదాలను మనం వివరించాలి.

1. **Individual freedom.**

2. **Fundamental right.**

మన జీవితము పుట్టినది మొదలు అంతమయ్యే వరకు మూడు వంతులు మనం Fundamental right తోనే జీవిస్తున్నాము. మన జీవితమంతా సమాజంతోనే గడుపుతున్నాము. నీకు నీవు ఏనాటికీ స్వతంత్రుడవు కావు. సంఘముతో, వ్యక్తులతో సంబంధ బాంధవ్యములను కల్పించుకొనక నీవు ఏకాంతముగ జీవించుటకు వీలుకాదు. నీవు ఏకాకిగా బ్రతుకుట సాధ్యముకాదు. కనుక మనము యావజ్జీవితము సంఘముతో సంబంధ బాంధవ్యములను కల్పించుకుంటున్నాము. కనుక సంఘసేవ నిమిత్తమై మానవత్వము ప్రాప్తించినదికాని కేవలము స్వసేవకై కాదని సేవాదళం సభ్యులు గుర్తించాలి. ఈ Duty అనే పదంలో మరొక అంతరార్థం కలదు. ఎదుటి వారి స్వాతంత్ర్యమునకు భంగము కలుగని స్వాతంత్ర్యాన్ని మనం చేపట్టాలి. నా స్వాతంత్ర్యము నాకు కలదని అహంకారియై ఎదుటి వ్యక్తియొక్క స్వాతంత్ర్యానికి భంగము కలిగించటానికి ముందంజ వేసినచో సంఘము నిన్ను శిక్షిస్తుంది. నీ స్వాతంత్ర్యమునకు నీకెంత అధికారము కలదో ఎదుటి వ్యక్తికి కూడ అంత అధికారము ఉంటుంది. దీనికి చిన్న ఉదాహరణ, నీకు స్వాతంత్ర్యము కలదు కదా అని ఒక పెద్ద కర్రను చేతబట్టి పెద్ద రోడ్డుమీద ఇష్టం వచ్చినట్లు త్రిప్పుకుంటూ పోవచ్చు. నీవు కర్రను త్రిప్పటంలో నీకు ఎంత స్వాతంత్ర్యమున్నదో ఎదుట ప్రయాణం చేస్తున్న వ్యక్తికి ఈ కర్రను తప్పించుకొనడంలో అంత స్వాతంత్ర్యముంటుంది. ఎదుట వచ్చే వ్యక్తి స్వాతంత్ర్యమునకు భంగం వచ్చేటట్లు నీవు ప్రవర్తించినచో సమాజం కాని. లేక ప్రభుత్వం కాని నిన్ను శిక్షిస్తుంది. కనుక ఈ Duty అనే పదం లోపల మన స్వాతంత్ర్యం, మన అధికారం ఎంత వరకు పరిమితమై ఉంటుందో అదే విధంగా ఎదుటి వ్యక్తికికూడ, అంతే అధికారం ఉంటుంది. నీకు అన్ని విధాల అధికారము ఉన్నది కదా అని గ్రామాలలో తిరగడానికి వీలుకాదు. అట్టి అధికారం కావాలంటే అరణ్యంలో సంచరించు. కనుక సమాజంలో ఉంటుంది అన్ని విధములైన అధికారములున్నవి కదా అని స్వాతంత్ర్యంతో చరించటానికి Prime Ministrకి కూడ వీలుకాదు. ఒక పెద్ద రాజ్యాన్ని పరిపాలించే మహారాజుకూడ ప్రజల అభీష్టములన్ని సంపూర్ణం గావించే కృషిచేయలేడు. నేను రాజును కదా అని స్వాతంత్ర్యంతో - సంచరించడానికి వీలు కాదు రాజునకు కూడ కొన్ని ఇబ్బందులు, క్రమశిక్షణ, కొన్ని నియమములు ఉంటున్నాయి. ఒక చిన్న భౌతికమైన రాజ్యమునకు అధికారిగా ఉన్న రాజునకే యిన్ని నియమములుండగా, సర్వలోక శరణ్యుడైన భగవంతునికి యింకా ఎన్నో నిబంధనలున్నాయి. దేవుడు ఏమైనా చేయవచ్చును అనడానికి వీలులేదు. తనకుకూడ కొన్ని నియమములు ఉంటున్నాయి. ఒక చిన్న ఉదాహరణ. లోకంలో భక్తులుంటారు. అందులో ఒక భక్తుడు "స్వామీ ! నేను పెట్టిన విత్తనములు ఎండిపోవుచున్నవి. సకాల వర్షము కురిపించ"మని ప్రార్థిస్తాడు. మరొక భక్తుడు అదే భగవంతుని "స్వామీ ! నా యింట కళ్యాణము చేయాలని ఆశిస్తున్నాను. ఈ మూడు దినములు వర్షము రాకుండ చేయి స్వామీ !" అని ప్రార్థిస్తాడు. ఒక భక్తుడు వర్షం రావాలని, ఇంకొక భక్తుడు వర్షం వద్దని ఆశిస్తున్నారు. ఇందులో భగవంతుని యిక్కట్టులో పెట్టినట్లుంది. అప్పుడు భగవంతుడు చేయాల్సిన పని ఏమి ? ఇరువురూ భక్తులే. ఇరువురు తమ స్వార్థాన్ని ఆధారం చేసుకుని ప్రార్థిస్తున్నారు. అయితే యిట్టి ప్రార్థనలన్నీ Direct గా భగవంతుని చేరుతున్నాయా ? అని ప్రశ్నించాలి.

ఒక రాజ్యానికి రాజు అధికారి. పెద్ద రాజ్యాన్ని ఒక్కరాజే పరిపాలనచేయుట అతి కష్టము కనుక కొన్ని శాఖలుగా విభజిస్తాడు. Revenue, police Administration యిట్లు అనేక శాఖలుగా విభజిస్తాడు. ఈ విధంగా విభజించటం వలన ఏ శాఖకు సంబంధించిన Files ఆ శాఖాధికారికే చేరుతాయి. రాజు పెద్ద అధికారి కదా! అని అతని దగ్గరకు వెళ్ళవు. ఆ యా కాగితములు ఆ యా శాఖాధిపతులకే చేరుతాయి. అదే విధంగా భగవంతుని సృష్టియందు కూడ ఈ పరిపాలనలో అనేక శాఖలుగా విభజింపబడి వుంటున్నాయి. ఇంద్రుడు, వరుణుడు, రుద్రుడు ఇటువంటి మంత్రులంతా వారి వారి శాఖలను వారు పరిపాలన చేస్తుంటారు. అయితే భగవంతుడు Prime Minister వలె అన్నింటికి అధికారిగా ఉంటారు. అతని శాఖ ఏమిటి! ఇతనికి మూడు రకములుగా సంబంధము కలిగిన బ్రాంచి ఉంటుంది. 1) నిష్కామ కర్మ 2) అనంతప్రేమ 3) నిర్మల చిత్తము. ఈ మూడు మార్గములద్వారా వచ్చే ప్రార్థనలన్నీ భగవంతునికి direct గా చేరుతాయి. మిగిలిన ప్రార్థనలన్నీ భగవంతునికి direct గా చేరడానికి వీలుకాదు. కనుక ఈనాడు మనం direct గా భగవంతుని అనుగ్రహాన్నీ, అనుమతినీ పొందాలంటే ఈ మూడింటి ద్వారా పొందటానికి వీలవుతుంది.

ఈ మూడింటియందు నిష్కామకర్మ ప్రధానమైన department. ఈ సేవ యందు మన సేవాదళ సభ్యులు పాల్గొనాలి. మనం సేవాదళ సభ్యులమని చెప్పుకుంటూ స్వార్థపరమైన సేవలు ఆచరిస్తే భగవంతునికి ద్రోహం చేసినట్లు అవుతుంది. పేరుకు తగిన ప్రవర్తనను మనం చేబట్టాలి. ఈ నిష్కామ కర్మ ఆచరించడానికి ప్రప్రథమంగా అహంకారాన్ని భస్మం చేయాలి, ఈ అహంకారం ప్రవేశించినప్పుడు సేవకు ఏ మాత్రం అవకాశం ఉండదు. మొట్ట మొదట సేవాదళ కార్యవర్గం ముందంజవేయాలి. ఈ నిష్కామసేవతో హృదయాన్ని వికసింపజేసుకోవాలి. మానవునిలో మానవత్వపు చైతన్యాన్ని వికసింప జేసుకోవాలి. గోకార్ ఇంతకు ముందే చెప్పాడు 'మనీషి'. అని ఈ మనీషి అనేదానిని మనం సరిగా వినిపించుకోనప్పుడు, కొంచెము అలక్ష్యంగా పలికినప్పుడు 'మహిషిగా' ఉంటుంది. అనగా మహేశ్వరుని నుండి వచ్చినది మహిషి-ఇది క్రమ క్రమంగా మహర్షిగా మారుతుంది. మనీషి పవిత్ర కర్మల నాచరిస్తూ నిష్కామకర్మలో పాల్గొన్నప్పుడు ఇతడే మహర్షి అయిపోతాడు. మహర్షి తత్త్వాన్ని చెందింపజేసేది మనిషియొక్క జన్మ. మనము ఈ నిష్కామకర్మచేస్తూ ప్రవర్తించాలి. నీవు ఏ కర్మ చేసినా దాని ఫలితాన్ని ఆశించకూడదు. ఏదో ఒక ఫలితాన్ని ఆశించకూడదు. ఏదో ఒక ఫలితాన్ని లక్ష్యములో ఉంచుకొని ఆ కార్యములో నీవు పాల్గొన కూడదు. నాజీవితకర్తవ్యము,ఇది నావిధి అని భావించాలి. ఇట్టి సేవలవలన గలుగుపుణ్యము ఎట్టి తపశ్శక్తి వలన కూడ కలుగదు. ఈ సేవ మానవులకు సన్నిహిత సంబంధమును కలిగిస్తుంది. ఈ స్నేహమే దైవ సన్నిధికి సరియైన రాచబాట. నవవిధ భక్తులలో స్నేహమనే భక్తి దైవముయొక్క స్నేహాన్ని కలిగిస్తుంది. శ్రవణం, కీర్తనం, విష్ణుస్మరణం, పాదసేవ, అర్చనం, వందనం, దాస్యం, స్నేహం ఆత్మనివేదనం-నీనిరో ఆత్మ నివేదనం స్నేహం ప్రక్కనే ఉన్నది. కనుక మనం ఈనాడు మానవుని యందే స్నేహతత్త్వాన్ని బలపరుచుకోలేని వ్యక్తులము ఇక దైవముయొక్క స్నేహాన్ని ఎట్లు అందుకోగలము? మానవులయందున్న మానవత్వాన్ని గుర్తించలేని వ్యక్తులము మాధవుని యందున్న దివ్యత్వాన్ని యెట్లు గుర్తించగలము! మనసేవ యావత్ ప్రపంచమునంతటినీ ఏకత్వముగా రూపొందించే సంబంధ బాంధవ్యము నేర్పరచుతుంది. మీరనుకో

వచ్చు-మేమంతా brothers వలె జీవిస్తున్నామని. కానీ, ఈ సోదరభావం కూడ నాదృష్టిలో చిన్నదిస్తాయి. Brotherhood of man Fother hood of God అంటున్నారు. దీనికంటెఉన్నతమైనదిఉన్నదనేసత్యాన్ని గుర్తించుకోవాలి. ఈ brothers గా ఉన్నవారు కూడ కలహించి, ఆస్తిపాస్తుల నిమిత్తమై ఎన్నో ప్రమాదాలకు గురియైన వారున్నారు. ఒక ఇంటికే నాలుగు తలుపులు తీసే brothers ఉన్నారు. ఈ Brotherhood of man కూడా సమాజంలో లేదు, మనసేవాదళం సభ్యులు Brotherhood of man కంటె యింకా ఉన్నతస్థాయి "ఏకాత్మభావం" కలిగి ఉండాలి. "ఏకం సత్‌విప్రాబహుధా వదంతి", "ఏకోహం బహుస్యామ్", "ఏకం ఏవ అద్వితీయం బ్రహ్మ." "ఈశ్వర స్సర్వభూతానాం," "ఈశావాస్యమిదం సర్వం"-ఈ ఉపనిషద్వాక్యముల అంతరార్థం యిదే. ఒక్క-ఆత్మయే అనేక జీవులలో దేహరూపవిభాగంలో అనేకముగా గోచరిస్తున్నదని, ఈ అనేకత్వములోని ఏకత్వమనే సత్యమును ఉపనిషత్తులు ప్రబోధిస్తూ వచ్చాయి. ఏదో ఒకరికి అపకారంచేసి, కీడునుకలిగించి బాధను కలిస్తున్నామని ఆనందముగా ఉప్పొంగరాదు. అది ఎవరికీ కాదు. నీకునీవే చేసుకుంటున్నావు. ఎవరికో సహాయం, మేలు నేను చేస్తున్నానని భావించరాదు. అది నీకునీవు చేసుకుంటున్నావు. ఏదిచేసినా ఏది చెప్పినా, ఏది తలచినా, అది నీకునీవే. అంతేకాని పరులకు కాదు; అనే అంతరార్థాన్ని గుర్తించాలి. ఒక చిన్న ఉదాహరణను All India state convenors Conference లో ఒకసారి చెప్పాను. మనం ఏమి చేసినా మనకు మనం చేసుకుంటున్నాము. ఒకనాడు ఒకయింటిలో 3 కప్పుల కాఫీని తయారుచేశారు. అందులో భార్య ఒక కప్పు, భర్త ఒక కప్పుత్రాగితే యింకా ఒక కప్పు మిగిలింది. ఈ ఒక్క- కప్పు కాఫీని చెరిసగం త్రాగుదామా? లేక ఎవరోఒకరు మాత్రం త్రాగుదామా? అని అనుకుంటూ ఉండే సమయంలో ఎవరో ఒక friend వచ్చాడు. అతనికి ఆ కప్పు కాఫీ యిచ్చారు. ఏదో నేను పెద్ద ఉపకారం చేశాను. మాయిద్దరికీ జగడం లేకుండ మేలు చేశాను. అని ఏదేదో పెద్ద ఉపకారం చేసినట్లు ఆ యజమాని భావించాడు. రెండు నెలలు గడిచాయి. మూడవ నెలలో ఆ friend తో ఏదో పని వచ్చి, ఈగృహయజమాని ఆ friend యింటికి వెళ్లాడు. ఆ friend ఆనాడు ఒక కప్పు కాఫీ యితనికి యిచ్చాడు. ఇతడు రెండు నెలల క్రిందట అందించిన కాఫీ ఈనాడు తిరిగి వచ్చేసింది. ఈ రెండు నెలలు ఆకాఫీని తన యింటిలో గ్లాసులో ఉంచిన అది పాడైపోయేది. తన యింటికి వచ్చినపుడు ఈ యజమాని ఆ కప్పు కాఫీ యివ్వకపోయిన తిరిగి ఈనాడు కప్పు కాఫీ యిచ్చేవాడుకాదు. అదేవిధముగా ప్రతికర్మ మనం తెలిసిచేసినా, తెలియక చేసినా మనకు తిరిగి చేరుతుంది. చెడ్డచేసినా, మంచి చేసినా ఏదో ఒక కాలంలో తిరిగి వస్తుంది. కనుక మంచిచేసి, మంచిని అందుకోవడానికి సంసిద్ధులైఉండాలి. కర్మమునకు కర్మయే మూల కారణము.

కర్మమున పుట్టు జంతువు
కర్మముననె వృద్ధిపొందు; కర్మమున చెడున్
కర్మమె నరులకు దైవము
కర్మమె సుఖదుఃఖములకు కారణమిలలో.

కనుక నీవు పవిత్రమైన కర్మలయందు నిష్కామ కర్మలు భగవత్ ప్రీత్యర్థం భావంతో, చిత్తశుద్ధితో చేయటం, అనంతమైన ప్రేమతో నిష్కామమైన భావంతో ఉండటం- ఈ మూడింటిచేత దైవాన్ని అతి సులభంగా చేరటానికి అవకాశం ఉంటుంది. ఈ విధమైన సేవద్వారా ఈ విధమైన కర్మల ద్వారా దైవాన్ని పొందడానికి దైవాన్ని చెందడానికి తగిన రాజమార్గం వేసుకోవటం సేవాదళం సభ్యులకుకానీ అధికారులకు కానీ సరియైన మార్గంగా విశ్వసించాలి.

ఈ నిష్కామకర్మ అనే దానిని ప్రత్యేకంగా భగవద్గీత విశిష్టమైన మార్గంగా ప్రబోధించింది. కర్మణ్యేవ అధికారస్తే అని నీవు కర్మకు మాత్రమే అధికారివి కానీ ఫలితానికికాదు అన్నాడు. భగవంతుడు కర్మఫలప్రదాత కానీ కర్మదాటికాడు. నీవు ఎట్టి కర్మలు ఆచరిస్తావో అట్టి కర్మఫలితాన్ని అందిస్తాడు. నీవు సత్‌కర్మలు చేయక, ఎన్ని విధముల ప్రార్థించి నన్నూ భగవండు ఆలకించవచ్చును గానీ, ఆ ప్రార్థనలను అభీష్టముచేయడానికి ముందుకు రాడు. ఒక చిన్న ఉదాహరణ. మహా భారతమునందు కృష్ణుడు సంక్రాంతి దినమున ఆనందముగా, ఉల్లాసంగా రాస క్రీడలు జరుపుతున్నాడు ఆనాడు భారతీయ సాంప్రదాయం ప్రకార చెఱకు తినడం వాడుక. కారణ మేమన సంక్రాంతికి క్రొత్తపంటగా వస్తుంది. ఈ చెఱకు. కొంతమంది గోపికలు కృష్ణునికి ఈ చెఱకును అందించారు కృష్ణుడు లీలగా ఆ చెఱకును తింటున్నాడు ఆధునిక కాలమువలె చెఱకు పిప్పిచేసి రసము తీసే మిషన్లు ఆనాడు లేవు. కృష్ణుడు తింటూ తింటూ ఉన్నప్పుడు చిటికెన వ్రేలునకు చెఱకు కోసుకొని రక్తపుబొట్టు క్రిందికి కారింది. అనేక మంది గోపికలు, సత్యభామ, రుక్మిణి, జాంబవతి అంతా ఉంటున్నారక్కడ. ఈ సత్యభామకు కృష్ణుని భార్యనని అహంకారం అధికంగా ఉండుటచేత గోపికలను ఇంటికి వెళ్ళి బట్టలను తెమ్మని పంపింది. గోపికలు అటు, ఇటు బట్టల నిమిత్తమై పరుగెత్తుతున్నారు. ప్రక్కనే ఉన్న ద్రౌపది తన చీరను చించి "కృష్ణా"! అని కట్టు కడతున్నది. సరే ఈలోపల కావలసినంత **bandeges** వచ్చినాయి. ఆ **bandeges** కృష్ణునికి నిరూప యోగంగా మారినవి. ఇంతటితో ఆ రోజు జరిగింది. కొంత కాలమైన తరువాత దుష్టులు, దుర్మార్గులు అయినా దుర్యోధన దుశ్శాసనులు ద్రౌపదిని అనేక విధముల హింసించటానికి, పరాభవం, చేయడానికి సభకు ఈడ్చుకొని వచ్చారు. ద్రౌపది అనేక విధములుగా కృష్ణుని ద్వారకావాసీ! గోకులవాసీ! ఆపద్బాంధవా! అనాథరక్షకా! అని ప్రార్థిస్తూ వచ్చింది. కృష్ణుడు ఇవన్ని వింటున్నాడు. కాని ఆమెను ఈ విధమైన సహాయం చేయడానికి ఈమె చేసిన కర్మ ఏమిటి? ఏమైనా మంచి చేసిందా! అని యోచించాడు. ఈ రకమైన సహాయం చేయడానికి తగిన కర్మ ఇది వరకు ఆచరించదా? అపుడే ఈ సహాయం చేయడానికి వీలవుతుంది. ఏదో ఒక సహాయం చేసి ఉంటే ఈ రకమైన సహాయం అందివ్వడానికి, సంబంధం ఉంటుంది యోచన చేశాడు. ఆనాడు సంక్రాంతి దినమున తన చీరను చేతికి కట్టుకట్టింది. కనుక ఈనాడు ఆమెకు చీరలివ్వడానికి, సరైన ఫలితాన్ని అందివ్వడానికి వీలుంది. ఆనే చిటికెనవ్రేలును తిప్పాడు. అదేచీర అక్షయంగా వచ్చింది. కనుకనే "కర్మణ్యేవ అధికారస్తే"—— మన యొక్క కర్మలకు అధికారులం కావాలి. సత్కర్మలు ఆచరించిన, అప్పుడు సత్ఫలితాన్ని భగవంతుడు అందిస్తాడు. కనుక ఆనాడు గోపికలంతా తన్నైమనమ! కర్మణే"—— అని మొదట నేను చేసే కర్మకు నమస్కారము అని నమస్కారం చేసి, ఆకర్మను ఆచరించేవారు. ఎందుకనగా 'నేను దేవునికి నమస్కారం చేసినా, నేను చేసినవి సత్కర్మలు కాకపోతే దేవుడు కూడా అనుగ్రహించడు. సేవలు ఎంత చేసినా కర్మలు సరియైనవి కాని నాడు సరైన ఫలితము రాదు. కనుకనే నా మంచి చెడ్డలకంతకు నేను చేసిన కర్మలే ఫలితాన్ని అందిస్తాయని, కర్మలకు నమస్కారం చేస్తూ వచ్చారు గోపికలు. ఎలాంటి కర్మలు మంచివి? అనగా భగవత్ప్రీత్యర్థము చేసే కర్మలు మంచివి. భగవంతుని ప్రేమ నందించే కర్మలు, భగవంతుని ప్రసన్నుని చేసే కర్మలు.

Gokak చెప్పినట్లు **Bhagawan is the greatest volunter** " ఇంకా "**Bhagawan is the greatest Sevadal leader**" అన్నాడు.

కనుకనే ఆ leader ను మీరు follow చేయాలి. ఎందుకనగా తెల్లవారి మొదలు రాత్రి వరకు ప్రతి చిన్న కార్యమును తాను స్వయంగా చేస్తాడు. అందు వలననే My life is message అని చెప్తాను. భగవాన్‌కానీ, భగవాన్ వాణి కాని - ఈ రెండు విరుద్ధమైనవి కావు. కనుక స్వామి చేసినట్లు చేయటము. స్వామి చెప్పినట్లు చేయటము-ఈ రెండు రకములుగా చేయటంచేత ఇదే భగవంతుని అనుగ్రహమును, సన్నిహితత్వాన్ని కలిగిస్తుంది. ఈ విధంగా చేస్తే మీరు పూర్తిగా స్వామి అనుగ్రహానికి పాత్రులవుతారు. స్వామికి కావలసినది నిష్కామ కర్మ. ఫలితం ఆశించకుండా నాకు పేరురావాలి, పదవి రావాలి, నాపేరు పెద్ద అక్షరాలతో Paper లో పడాలని అనుకోకుడదు. సేవాదళం కార్యవర్గంలో ఎవరెవరికి అభిప్రాయ భేదాలు లేకుండా చూసుకోవాలి. వ్యక్తిగతమైన ద్వేషములకు ఏమాత్రం అవకాశం ఉండకూడదు. ఎవరిని నీవు ద్వేషించినా నీ స్వామిని నీవు ద్వేషించిన వాడవవుతావు. తెలిసియో తెలియకయో మానవులలో కొన్ని పొరపాట్లు రావచ్చు. Past is Past, forget the past. జరిగి పోయింది. నీవు మరచిపోయి, నీవు ఇకనైనా అన్యోన్యతతో, ఆత్మభావంతో, ఏకాత్మ సంబంధము చేత ఈ సేవలో పాల్గొనుటచేత మన సత్యసాయి సేవాదళం సభ్యులకీర్తి ప్రపంచ వ్యాప్తం అయ్యే అవకాశం ఉంటుంది, ఆదర్శవంతంగా ఉండటానికి అవకాశం ఉంటుంది. నిస్వార్థ సేవ అనే ఆదర్శంపైన మన జీవితసౌధాన్ని నిర్మించుకోవాలి. ఈ యొక్క ఆదర్శమైన నిష్కామసేవ ద్వారా మీరు ఇంక మిగిలిన ఆదర్శాలనన్ని చేర్చుకుంటారు. దీనినే మీరు లక్ష్యము నందించుకొని, దీనినే ఆదర్శంగా వుంచుకొని, ముమ్ముందు మీరు చేయవలసిన కార్యములతో ముందంజ వేస్తారని నేను ఆశిస్తూ ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

సేవాదళ్ కన్వీనర్ల ట్రెయినింగ్ కెంప్
సందర్భమున
శ్రీ వారి దివ్యసందేశం.

# మేలుకొలుపు

— ఆర్. వి. ఎస్. సన్యాసిరావు

మేలుకో పర్తి పురీ వాసా - సాయీశా
శ్రీ సత్య సాయీశ మేలుకో
ప్రణవ నాదముతో ప్రణుతించు చున్నాము
ప్రణవ స్వరూపా మేలుకో ॥మే॥

సుప్రభాతముతో స్తుతియించు చున్నాము
సుందర రూపా మేలుకో
ఉదయభానుని వలె ఉదయించునటుల
ఓంకార రూపా మేలుకో ॥మే॥

భక్తులందరము కూడి భజియించు చున్నాము
భవరోగ నాశా మేలుకో
చిరునగవు కిరణాలు చిందించు మోముతో
శ్రీ చిద్విలాసా మేలుకో

పశుపక్ష్యాదులు సైతం పాపక్షాళనమునకై
పరుగున వచ్చినవి మేలుకో
పశుపతి నీవేయని శిశుజనులు వచ్చిరి
శివశక్తి రూపా మేలుకో

సర్వ లోకాలను పాలించే వేళాయె
సత్య స్వరూపా మేలుకో
ప్రాతః కాలమాయె ప్రభాత వేళాయె
ప్రశాంతి వాసా మేలుకో ॥మే॥

# BHEL

మానవజాతి నీతి శీలములపై ఆధారపడియుంటున్నది. మానవజాతికి నీతి శీలములే పునాదులు. ఆధ్యాత్మికమే ఆయువుపట్టు. సత్సంప్రదాయములే జీవితమునకు శోభ. జీవితములో నిత్య సత్యములుగా ప్రకాశించే ప్రాచీన సంప్రదాయములను సంస్కృతిని కాలానుగుణ్యముగా సమర్థించుకొని సంరక్షించుట యందే నేటి సమస్యలకొక పరిష్కారము ఇమిడి యున్నది. ఒకే దివ్యశక్తియే అందరి మానవుల యందును సమంగా ప్రకాశిస్తూవున్నది. కాని ఆ దివ్య శక్తిని కొందరు సక్రమ మార్గమునందు వినియోగ పెట్టటము మరికొందరు అక్రమమార్గమునందు అనుభవించడం చేతనే మానవుని స్థితిగతుల మార్పుకు మూలకారణము. మన బ్రతుకు కేవలము బయట నుంచి వచ్చి చేరినదికాదు. ఇది బ్రహ్మముద్వారా లభించినటువంటిది. మన జీవితము ఆత్మపైన ఆధార పడేదే కాని, అన్నముపైన ఆధారపడేది కాదు. కాని ఇట్టి సత్యమును సామాన్యమైన మానవులేకాక విద్యావంతులుకూడనూ గ్రహించలేక ఏదో భౌతికమైన సౌఖ్యములనిమిత్తమై తమయొక్క జీవితము నంతయు కూడను వ్యర్థముగా వించుకొనుటకు ప్రయత్నిస్తున్నారు. జీవితమునకు కావలసిన సర్వ సౌఖ్యములు సంతోషములుకూడను మనయందే ఇమిడి యున్నవి. కాని బయటనుంచి మనకు లభించినవికావు. సర్వ సౌఖ్యాధారమైన దివ్యత్వము మన యందే ఉన్నదన్న సత్యాన్ని అనేకమంది గుర్తించుకొనలేక పోతున్నారు. కేవలము ఒక విధమైన భ్రాంతికి లోనై సౌఖ్య సంతోషములకు లోబడి తద్వారా ఆధునికమైన ప్రోత్సాహ ఉత్సాహములకు లొంగి మానవత్వములోని దివ్యత్వాన్ని గుర్తించలేక పోతున్నారు. దేదీప్యముగా ప్రకాశించే సూర్యునిముందు నిల్చుని "అంధకారము" "అంధకారము" అని అరచే టటువంటి మూర్ఖునకు ఎవరు జ్యోతి నందించగలరు? నిండు నదిలో నిల్చుని "దాహము" "దాహము"ని ఏడ్చే మూర్ఖునకు ఎవరు జలము నందించగలరు ? అదే విధముగానే మనయందు దివ్యత్వము నిండి నిబిడీకృతముగా నున్నప్పటికిని సర్వాధారమై ప్రకాశిస్తూ ఉండినప్పటికిని అజ్ఞానమునందు మునిగి అంధకారము నందు తేలుచూ కేవలము దివ్యత్వము ఎక్కడ ఎక్కడ అని పరిశోధన సలిపే పామరులకు ఎవరు దివ్యత్వాన్ని అందించగలరు? కేవలము అభిమాన మమకారములకు లొంగి మనయొక్క దివ్యత్వమును గుర్తించుకొనలేక పోతున్నాము. ఈ విధమైన అజ్ఞానమునకు కారణము లేకపోలేదు. ఒకవైపు సాంకేతిక విజ్ఞానశాస్త్రము బ్రహ్మాండంగా అభివృద్ధి గాంచుతూ వచ్చుచున్నది. ప్లాస్టిక్‌తో ఎలక్ట్రిక్ కంప్యూటర్సుతో అనేకరకములైన డెవలప్‌మెంట్స్ జరుగుతూ వస్తున్నవి. మహాద్భుతమైన శక్తులను కూడను సాధించగలుగుతున్నారు. అణుశక్తులచేత అనేక విధములైన యాత్రలను సలుపుతూ అంతరిక్ష యాత్ర యందుకూడనూ దిగ్విజయమును సాధిస్తున్నారు.

రెండవ వైపున మనయొక్క జీవితమును క్రియ తంత్రములచేతను ఆర్థిక వ్యవహారములచే జాతి, మత కల్లోలముల చేతను ప్రాంతీయ

మానములచేతను తాము తమ కర్తవ్యాన్ని విస్మరించి దేశముయొక్క సౌభాగ్యము విస్మరించి ఆవిర్భవింప చేసిన యొక్క శక్తికి అర్పణ చేయగోరుచున్నారు. ఈ పరస్పర విరుద్ధమైన ఈ రెండు శక్తులకు మూల కారణమేమి? ఇవి రెండు కూడనూ మనలో నున్నట్టి దివ్యశక్తిని మనము సక్రమ మార్గమును అవలంబింప జేయక, భౌతిక, లౌకిక, ప్రాపంచిక సంబంధమైనఈ పంచభూతములయందే ఈజీవితాన్ని ఇమిడ్చుకోవటం చేతనే ఈ విధమైన లోటుపాట్లకు కారణము ఏర్పడుతున్నది. ఈనాడు ప్రపంచమునకు కావలసినది నూతన సమాజము కాదు. నూతన మతము కాదు. నూతన విద్యకాదు. పవిత్ర మనశ్చిత్తములు గలిగిన వ్యక్తులు అత్యవసరము. మానవునియందు అనేక విధములైన దివ్యశక్తులు వుండినప్పటికిని ఇందులో ఒక పూర్వజన్మకృతముగా ఏర్పడిన పశుత్వము కూడను చేర్చబడి యుంటున్నది. అందు వలననే మనయందు అప్పుడప్పుడు ఈ విధమైన నిర్దయ నిస్పృహ, నిరాశలు ఇలాంటివాటికి గురియై పోతూ దయా దాక్షిణ్యాలు రహితమై తాను కొంతవరకు దానవత్వాన్నికూడనూ అవలంబింప చేసుకొంటున్నాడు. దీనికి కారణము, మానవునియందు అవిశ్వాసము, అశ్రద్ధ, అహంకారము, అసూయ అనే పెను భూతములకు లోబడి పోవటం చేతనే మానవుని జీవితం యొక్క పెడమార్గం ఒక కారణంగా ఏర్పడినది. ఈనాడు మానవుడు తనకు అవసరం లేని కార్యముల యందు పనులయందు కూడను శ్రద్ధను అభివృద్ధి పరుచుకొంటున్నాడు. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అని శ్రద్ధ చేతనే మనకు సర్వజ్ఞానము కూడను లభించును గాని అశ్రద్ధచేత ఎట్టి చిన్న కార్యము నందు కూడను మనము విజయాన్ని సాధించలేము. ఒక మొక్కను నాటి దాన్ని వృక్షంగా చేయాలను కొన్నప్పుడు దానిని పెంచే శ్రద్ధలో మనము వుండినవుడే ఆ మొక్క కూడనూ చెట్టుగా రూపొందుతుంది.

అణుమాత్రమైన అగ్నిని కూడనూ మనము శ్రద్ధచేత అఖండమైన అగ్నిగా కూడనూ రూపొందింపచేసుకొన వచ్చును. తట్టెడు అగ్నిని తెచ్చి మన కిచ్చినప్పటికిని అశ్రద్ధ చేత మనము దానిని ఆర్పి వేసుకొనవచ్చును. కనుకనే శ్రద్ధ చేత మనము ఎంతవరకైన కూడనూ కార్య సాఫల్యమును అందుకోవటానికి అవకాశం వుంటుంటాది. ఈ శ్రద్ధ ఒక విధమైన ఆత్మ శ్రద్ధగా ఆత్మ విశ్వాసంగా వుంటుండాలి. ఎన్ని విధములైన అపజయములు ఆటంకములు అడ్డుతగిలి నప్పటికిని దానిని లెక్కచేయక ఎన్ని పర్యాయములైన కూడనూ విజయానికి మనము ధైర్యంగా సాహసంగా ముందంజ వేయటానికి పూనుకోవాలి. అనేక పర్యాయములు అపజయము పొందినట్టి "మహమద్ షా మూడవ పానిపట్ యుద్ధమునందు తన యొక్క శ్రద్ధ చేతనే విజయాన్ని సాధించుకోగలుగుతూ వచ్చాడు." గురు నానక్, శివాజీ ఇంకా అనేకమంది ఈవిధమైనటువంటి వీరులందరు కూడనూ [illegible] అపజయములు పొందినప్పటికిని, అనేక విధములుగా ఆత్మ విశ్వాసములు పెంపొందింపచేసుకొని విజయం సాధించినట్లు మన చరిత్రలో ప్రత్యక్షంగా నిరూపిస్తూ వచ్చినది. వీరులు, శూరులు, ధీరులు మహాశక్తి మంతులైనవారు ఈ విధమైన ఆత్మ విశ్వాసంతోనే విజయాన్ని సాధించుకొంటూ రాగా ఒక ఆధ్యాత్మిక మార్గమునందు జయదేవ, గౌరాంగ తుకారాం, రామ కృష్ణ పరమ హంస, రామదాస్, తులసీదాస్, కబీర్ దాస్ ఇలాంటి మహాభక్తులు కూడను తమ యొక్క ఆత్మ విశ్వాసము చేతనే విజయాన్ని సాధిస్తూ ఆత్మానందమును అనుభవిస్తూ ఆత్మ సామ్రాజ్య పట్టాభిషేకానికి సంయుక్తులయ్యారు కనుక ఆత్మ విశ్వాసము చేత ఎట్టి ఘనకార్యమునైన కూడ మనము సులభముగా సాధించుకోవడంలో అవకాశం వుంటుంటాది. ఈ ఆత్మ విశ్వాసమే మన జీవిత సౌధమునకు పునాది వంటిది. మానవ జీవిత వృక్షమునకు వేరు వంటిది.

మానవత్వమునకే వెన్నెముక వంటిది. కనుక ఇట్టి విశ్వాసమునే బలపరచుకోవాలి. ప్రేమ స్వరూపులారా! విశ్వాసమే లేక మనము జీవితములో తెల్లవారినది మొదలు రాత్రి పరుండునంత వరకును ఎట్టి కార్యమును కూడను సాధించలేము. ఒక చిన్న ఉదాహరణము. నేడు మీరంతరు కూడాను, ఈ ప్లే గ్రౌండు లోపల సమావేశమయ్యారు. మీకు ఈ సమావేశమునకు పోయి తిరిగి ఇంటికి క్షేమంగా వచ్చి చేరగలవు అనే విశ్వాసమే మీలో లేకపోతే ఈ సమావేశానికి మీరు రాలేరు. అంతవరకు పోనక్కరలేదు. మనము ఆఫీసుకు వెళ్లి తిరిగి ఇంటికి క్షేమంగా చేరగలము అనే విశ్వాసమే మీలో లేకపోతే ఆఫీసుకే మీరు బయలు దేరరు. ఒక యజమాని ఇల్లు కట్టుటకు ప్రయత్నము చేసి పునాదులు వేసి ఇల్లు నేను కట్టగలను. ఆ యింటిలో నేను నివాసం చేయగలను. అనే పూర్ణ విశ్వాసమే తనయందు లేక ఉండిన అపునాదికే తాను పూనుకోడు. కనుకనే విశ్వాసమే మనయొక్క శ్వాస స్వరూపమును ధరించి వున్నది. విశ్వాసమే లేకపోయిన మనది శ్వాసలేని జీవితంగా రూపొందుతుంది. కనుక జీవితాన్ని పూర్ణ విశ్వాసం చేత ముందంజ వేయించటానికి పూనుకోవాలి.

ఇక రెండవది అశ్రద్ధ. ఈ అశ్రద్ధ అనేటట్టిది కొంతవరకు మానవుని అయోమయ స్థితికి కొనిపోతూ వస్తుంది. మనకు ఏది అవసరము? ఏది అనవసరము? ఏది మనము చెయ్యవలసినది? ఏది మనము చెయ్యదగనిది? అని విచారణ చేసుకొన్నప్పుడు మనకు అందులో ప్రధానమైనటు వంటిది ఏది అని గుర్తించడానికి వీలౌతుంది. మానవత్వాన్ని నిర్మూలంగావించే కృత్రిమమైన వ్యక్తుల యందు కొంత వరకును, కృత్రిమమైన పనులయందు, మనయొక్క శ్రద్ధను అభివృద్ధి పరచుకొంటూ వస్తున్నాము.

ఇంక మూడవదైనటువంటిది అహంకారము. ఈ అహంకారమనేది మరణముతో సమానము. ఇది కేవలము మరణమే కాదు మరణమునకు పెద్దక్క అనికూడను చెప్పవచ్చును. కారణమేమనగా తన యొక్క స్వరూపాన్ని కూడను తాను మరిసింప చేస్తుంది. ఈ అహంకారము మానవత్వాన్నే నిర్మూలంగావిస్తుంది. ఈ అహంకారము తనయొక్క బంధుత్వాన్ని కాని కట్టుకొన్న భార్యనైన, కన్న కొడుకునుగాని లెక్కచేయ నటువంటి దురవస్థలకు గురియైపోతుంది. ఎంత శక్తి సామర్థ్యమున్నప్పటికిని ఎంత పదవి అధికారంలో ఉండినప్పటికిని ఎంత విద్యావంతుడైనప్పటికిని, ఎంత ధన కనక వస్తు వాహనాదులు కలిగినప్పటికని అహంకారమనేది మనలో ప్రవేశించెనా సర్వము కూడనూ క్షీణించి పోతుంది. యోగికి కాని, భోగికి కాని, జోగికి కాని, విరాగికి కాని, బైరాగికి కాని, సామాన్యమైన మానవునికి కాని అహంకారమనేది మహాశత్రువు. కనుక ఈ అపవిత్ర శత్రువైన అహంకారాన్ని మనలో ప్రవేశించకుండా చేసుకోవటానికి తగిన కృషి సల్పుకోవాలి. హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల చరిత్ర మీకందరకిని భారతీయులకు తెలిసిన విషయమే. సర్వశక్తి మయులైనప్పటికిని సర్వజ్ఞులుగా వుండినప్పటికని వారికి అహంకారమనేదే పతనానికి మూల కారణంగా ఏర్పడింది.

రావణ, కుంభకర్ణ, కంస, దంతవక్త్ర, శిశుపాలాదుల వంటి మహావీరులు కూడను ఈ అహంకారముచేతనే తన బలము, ధనము, శరీర బలము కూడనూ తాను క్షీణింపజేసుకొని కట్ట కడపటికి జీవితమునే భస్మము గావించుకొన్నారు. కనుక ఈ అహంకారమనేది ఎంత వరకు పతనం గావిస్తుంది అనేవి మన పవిత్రమైన చరిత్రలు మనకు ప్రబోధిస్తు వచ్చాయి. కనుక అహంకారము చేత మనము అల్పులుగా మారిపోతున్నాము. అజ్ఞానులుగా రూపొందుతున్నాము. కేవలము అహంకారమనేది అజ్ఞానము యొక్క మూలకారణమనే చెప్పవచ్చు. ఈ అహంకారము ఎంత వరకు మనలను కొనసాగింప చేస్తుంది? కొంతవరకు. ధన మున్నంత వరకు కొనసాగించ వచ్చును. లేక అధికార బలమున్నంత వరకు కూడ అహంకారము పని చేయవచ్చును. తదుపరి నీ అవస్థల పని ఏమిటి? ప్రేమ స్వరూపులారా? ధన కనక వస్తు వాహనాదులు కాని, అధికార సంపత్తులు కాని మనకు స్థిరమైనవి కావు. కదలిపోయే మేఘముల వంటివి. శక్తిసామర్థ్యములకు అధికారమునకు మనము ఉప్పొంగి

కేవలము మన మానవాత్వాన్నే మరచి తాత్కాలిక మైన జీవితము లోపల ఎంత అపకీర్తుల పాలై పోతామో కొంత వరకు యోచించుకోవాలి. చెరువులో నీరు ఉండి నంత వరకు కప్పలు వచ్చిచేరుతుంటాయి. చెరువులో నీరు ఎండిపోయెనా ఒక్క కప్పైన అక్కడ నిల్వదు. అదే విధముగానే మనకు అధికారముగాని ఇంకే విధమైన ధనబలమో జన బలమో ఉండినంత వరకు అహంకారముతో విఱ్ఱవీగవచ్చును. కాని ఈ ధనము ఈ అహంకారము క్షీణించిన తరువాత నీ పనివారు కూడను నిన్ను గౌరవించరు. కనుక అధికారంలో ఉండినంత వరకు మనము అహంకారాన్ని కాదు పెంచుకోవలసింది. సామరస్యమును, ప్రేమను, సన్నిహితమైన సంబంధాన్ని మనము పెంచుకోవడానికి ప్రయత్నించాలి.

ఇక నాలుగవదైనటువంటిది అసూయ. ఈఅసూయ అనేటటువంటిది మహా శత్రువు. ఇది నిజంగా మానవుని యందు ప్రవేశింప తగినట్టిదికాదు. ఇది రాక్షసులలో ప్రవేశించుటకు తగినటువంటియొక్క అధికారము. అలాంటి అసూయా పరులను మనము చెంత కూడను చేరుటకు వీలుకాదు. అందువలననే వేదాంతం కూడను బోధిస్తూ వచ్చింది. అంటగరాని వాడెవ్వడు అవనిలోన అని "ఓర్వలేనట్టి గుణము వాడే సుమ్మీ" అని జవాబు చెప్పింది. కనుక మనము అసూయాపరుల దగ్గరకుకూడను పోవటానికి వెనుకంజ వేయాలి. అసూయా పరులను మనము టచ్ చేసిన కూడను కరెంటు వలె ఆ అసూయకూడను మనలో ప్రవేశిస్తుంది. కేవలము అగ్ని ఎవడు ముట్టునో వాని వేలు మాత్రమే కాలుస్తుంది. కరెంటు నెవరైనా ముట్టిరా వానిని ఇంకా పది లక్షల మంది ముట్టిన కూడనూ పదిలక్షలమంది కూడను భస్మమైపోతారు. అదే విధముగానే అసూయా పరులకు ఈ అసూయ అనేటటువంటిది మహా దావాగ్ని. దీనిని ముట్టినటు వంటి వారి నందరిని భస్మంగావిస్తుంది. కనుక ఈ అసూయను మనము దగ్గరకు చేర్చుకోవటానికి ఏ మాత్రము కూడనూ ప్రయత్నించ కూడదు. అవిశ్వాసము, అశ్రద్ధ, అసూయ, అహంకారము, ఈ నాలుగింటిని మానవుడు ఏ నాడు దూరము చేసుకొనునో ఆనాడే మానవుడు మాధవుడుగాను, నరుడు నారాయణుడుగాను మారడానికి అవకాశంగా వుంటుంది. ముఖ్యంగా భారతదేశమునందే కాక యావత్ ప్రపంచము నందు కూడను సర్వ మతముల వారు కూడను ఈ సమరసమైనటువంటి యొక్క సత్యాన్నే నిరూపిస్తూ వచ్చారు. అన్ని మతములు కూడను పవిత్రమైనటువంటివే. అన్ని మతముల యొక్క ప్రబోధలు కూడను చాలా పవిత్రమైనటు వంటివే. గమ్యము ఒక్కటే. దైవము ఒక్కడే.



# గాది సందేశము

"మంచికాలము పదవులు మంచి బ్రతుకు, కోరు చుందురు మనుజులు కోరబోరు మంచి బుద్ధులు జ్ఞానంబు మంచినడత; ఇంతకన్నను వేరిద్ది యెరుక పరతు ?" "చెప్పుట సులభంబు చేయుట కష్టంబు, ధాతకైన వాని తాతకైన; చెప్పుట కంటెను చేయుట శ్రేయంబు, ఉన్నమాట తెలుపుచున్న మాట."

పవిత్రాత్మ స్వరూపులారా!

ఈనాడు పవిత్రమైన ఉగాది పర్వదినము, గతించిన సంవత్సరానికి వీడ్కోలు; వచ్చిన సంవత్సరానికి పుష్పాంజలి స్వాగతం. ఈ సిద్ధార్థిలో మన కాలం కర్తవ్యం సార్థకం కావాలని ఆకాంక్ష. నవ వసంతం సమస్త చరాచర ప్రపంచానికి ఆయురారోగ్యాలు సద్బుద్ధులు ఇవ్వాలెనని ప్రార్థన. కడచిన సంవత్సరపు మధురానుభూతులు కొన్ని విషాదగతాలు కొన్ని మానసంపైన కదులుతునే ఉన్నవి. ఈ అనుభూతులు మనకు చక్కని గుణపాఠములు నేర్పుతాయి. ఎవరికి వారు కడచిన సంవత్సరంగూర్చి విచారిస్తే ఆకాలంలో ఎంత స్వార్థానికి ఉపయోగమైనది సేవకెంత వినియోగమైనది తెలుస్తుంది. ఈనాడు మానవుడు భౌతికంగా వైజ్ఞానికంగా కొంత అభివృద్ధిని సాధించినాడు

కాని నైతికంగా పతనమై పోయినాడు. స్వార్థంతో అహంకారంతో దిగజారిపోతున్నాడు. ఇది కేవలము నిరుపయోగము. ఈ పతనానికి కారణము ఏమిటి? స్వార్థము, అజ్ఞానము, అవిద్య అనేవే కారణములు. మనిషియొక్క ప్రతిమాటకు క్రియకు తలంపుకు వెనుక స్వార్థం కదలాడుతున్నది. విముక్తి కోరేవారు దీనిని జ్ఞానాగ్నిచేత దగ్ధంచేయాలి. లేక పోతే మానవునికి మనుగడయే లేదు. మానవుడంటే ఎవరు? మంచి ఊహలు భావములు భవిష్యత్తు కలవాడు. మంచి భవిష్యత్తుకు ఆధారం మంచి తలంపుల పంట. దీనిని ఆత్మతత్త్వంలో నిరూపించాలె. కుర్చీ కర్రలో లేదు, మనస్సులో లేదు. అట్లాగే ఆత్మతత్త్వంకూడ దేశకాలాలకు అతీతమైనది. అఖండమైన యిట్టికాలాన్ని దుర్వినియోగం చేయవద్దు. కాలమును కర్మను కర్తవ్యమును మంచిగా వినియోగించాలి. కాలం క్షణక్షణమూ మారుతుంది. జీవితం నీటిబుడగవంటిది. ఆయువు చిల్లులకుండలోని నీరువంటిది. ఇది గమనించక పోవటం అజ్ఞానానికి మూల లక్షణం. మనలోని లోపాలను దిద్దుకోవటం ఈనాడుఅత్యవసరము. మానవ జీవితంలో నిత్య సత్యమైనదానిని గుర్తించి కాలమును సద్వినియోగం చేయండి.

మన భారతదేశంలో 56400 కుగ్రామాలున్నాయి, ఈ పల్లెల పరిస్థితి చాలా విచారకరంగా దయనీయంగా ఉంది. పల్లెలలో ఉండే సోదర మానవులను ఆదుకొని తమస్థాయికి తీసుకరావటానికి పట్టణవాసులు సమాజసేవా కార్యక్రమాలలో నిమగ్నులు కావాలె. ఈనాడేది చేసినా ఏది తలచినా స్వార్థంతోనే. వ్యర్థులమై పోతున్నాము. ఇక పరార్థము గుర్తించేది ఎప్పుడు? అనేక ఆశలు పెట్టుకొని మోసపోతున్నాము. వేదిక లెక్క ఉపన్యాసాలు చేస్తున్నాము. కాని చెప్పినది చేయటంలేదే. "చెప్పవచ్చు కోటి;చేయరు ఒక్కటి". అందుకే "ఉత్తిష్ఠ జాగ్రత ప్రాప్య వరా న్నిబోధత" అన్నది ఉపనిషత్తు. వేదికలెక్క సోదరీ సోదరులారా అంటున్నాము. అందరం సోదరుల మనుకుంటున్నాము. కాని నిజమైన సోదరులే ఆస్తులకోసం పోరాడుతూ సుప్రీంకోర్టుల వరకు పోతున్నారు. కనుక వట్టి మాటలుగా సోదరులమనుకోవటం కంటే అంతకంటే మిన్నయైన ఆత్మభావం పెంచుకోవాలి. దైవ పితృత్వమూ మానవ సోదరత్వమూ అప్పుడే సార్థకమౌతవి.

ఈనాడు పవిత్రమైన ఉగాది దినం. విందుభోజనాలు చేయటం కొత్తబట్టలు కట్టుకోవటంతో సరిపోదు నూతనసంవత్సరం నూతనోద్యమం ప్రారంభించండి పల్లెటూరి వారు అనేక బాధలు పడుతున్నారు. వాళ్లకు సరియైన వైద్య విద్యా సౌకర్యాలు లేవు. త్రాగడానికి మంచినీళ్లు లేవు. మరుగుదొడ్లు లేవు, తినడానికి తిండిలేదు. వాళ్ళకు ఈ సౌకర్యాలు కల్పించే సేవ చేసి దానిద్వారా దైవత్వాన్ని చూడండి. ఈనాడు శ్రమపడేవాడు కావాలె. వట్టిమాటలు చెప్పేవాడుకాదు. మనది భరతభూమి. కర్మభూమి. శ్రమపడటమేకర్మ. అప్పుడే ఇది కర్మభూమి ఔతుంది. భగవద్రీతి కలిగినదే భరతభూమి. కనుక శ్రమించి పల్లెసీమలవారిని ముందుకు తీసుకవచ్చి భగవద్రతిని పొందండి. ఈనాడుమన బ్రతుకులు దారేషణ ధనేషణ పుత్రేషణ అనే ఈషణ త్రయంతో మలినమై పోయినవి ధనం మానవుని మత్తుని ఉన్మత్తుని చేస్తుంది. ధనం అవసరమే. కాని దానికి ఒక హద్దుఉండాలె. మితిమీరిన ధనం మతిహానిచేస్తుంది. ధనం సంపాదించటం కంటే సంపాదించిన దానిని కర్చుపెట్టడం కష్టం. మిగిలిన ధనాన్ని దాచటం మరీకష్టం. ఈ కష్టాలలో కొన్ని సుఖాలు లేకపోలేదు, కనుక ఈ ధనాన్ని పల్లెసీమలవారికి దీనులకూ వెచ్చించి సద్వినియోగం చేయండి. ధన మూలం మిదం జగత్ కాదు. ధర్మమూలమిదం జగత్. ధనం పెరిగితే పశువుకు కొమ్ములు పెరిగినట్లు అశాంతి. ధనం వెంట దుఃఖం కూడా పెరుగుతుంది. ధనమున్న వానిని ఒకవైపు ప్రభుత్వము మరొకవైపు బంధువులు ఇంకొకవైపు దొంగలు బాధిస్తారు. ధనమున్నవాడు పడే బాధ దైవానికి తెలుసు. పుత్రులకోసం ధనం ప్రోగుచేసినవారు పుత్రుల మూలంగానే బాధలు పడుతున్నారు. కనుక దానధర్మాలు చేసి మీ ధనమును సార్థకం చేసికొనండి. సత్యసాయి సంస్థలవారు ప్రతి పల్లె తిరిగి ఆ పల్లెటూరివారి జీవితాలను బాగుచేయాలి. సత్యసాయి సంస్థలవారికి ఇదొక క్రొత్త ఉద్యమము. నేను

ప్రతి పల్లెకు వస్తాను. ప్రభుత్వం ఏమేమో అంటుంది. దానితో ప్రమేయంలేకుండా కుల మత జాతి వర్గ విచక్షణ లేకుండా సత్యసాయిసంస్థలు ఈనాటి నుండి పల్లెసీమలనుద్ధరించే కార్యక్రమాలు చేపట్టి ప్రతి గ్రామం వెళ్ళి వారికి విద్యా వైద్య సౌకర్యాలు కల్పించవలెనని కోరుచున్నాను. ధ్యాన తపములు స్వార్థానికే ఉపయోగపడుతాయి కాని త్యాగముచేత లోకకల్యాణం జరుగుతుంది. "త్యాగే నైకే అమృతత్త్వ మానశుః" అని త్యాగమును అందుకే ఉపనిషత్తులు మోక్షకారణముగా చెప్పినవి. కాన ఈనాటి నుండి సత్యసాయి సంస్థలవారు త్యాగం ప్రదర్శించి పల్లెలవారికి అనుకూలాలు కల్పించవలెనని కోరుతున్నాను. అంతో ఇంతో నీతి నిజాయితి ఇప్పటికీ పల్లెలలో మిగిలిఉన్నది. పట్టణాల్లోలేదు. కనుక డబ్బుగల వారంతా ఈ పల్లెటూరి వారిని అభివృద్ధి పరుస్తారని ఆశిస్తున్నాను.

పర్వదిన మంటే పాత తోరణాలు తీసివేసి కొత్తవైన పచ్చతోరణాలు కట్టుకొనటంకాదు. పాత దుస్తులు తీసివేసి కొత్త బట్టలు కట్టుకొనటంకాదు. ఇంతమాత్రం చాలదు. పాతభావాలు తీసివేసి కొత్త భావాలకు ప్రోది చేయండి. వేపు తీపి కలిపిన ఉగాది పచ్చడి కష్టసుఖముల సమత్వానికి చిహ్నం. పల్లెసీమల సేవ చేయడానికి చిన్నప్పటి నుండి పిల్లలకు, విద్యార్థులకు తరిఫీదు ఇవ్వాలి. మన దేశంలో ఈనాడు255000మందిపిల్లలున్నారు. వీళ్ళల్లో 40 శాతం బిచ్చమెత్తుకుంటున్నారు. ఇట్టి కష్ట పరిస్థితుల్లో మనం ఊరకుండటం మంచిది కాదు. జప సాధనలు కట్టిపెట్టి మానవ సేవే మాధవ సేవ అనే భావంతో త్యాగంతో శ్రమతో వాళ్ళను ఉద్ధరించవలె. మీరంతా రాజకీయ కుల మత భేదాల కతీతంగా పవిత్రమైన భావనతో మీ మీ శక్త్యనుసారం వీరికి సేవ చేయటమే ఈ నూతన సంవత్సర దీక్షగా పూనండి. ప్రతి సంవత్సరానికి స్వాగతమే. ప్రతి సంవత్సరానికి వీడ్కోలే. దుఃఖానికి సుఖానికి ఆత్మవిశ్వాసమే రక్ష. అది లేకపోతే మానవత్వం క్షీణిస్తుంది. ఈ భావంతో సేవ చేస్తే మన దేశం ఇతర దేశాలకు ఆదర్శప్రాయంగా ఉంటుంది. మేము భారతీయులం అని చెప్పుకుంటాముగాని భారతీయ సంస్కృతిని ఏమి పోషిస్తున్నాము? ఆధ్యాత్మికాభివృద్ధికి ఆత్మవిశ్వాసమే ముఖ్యం. కనుక పల్లెల సేవే దైవ సేవగా భావిస్తారని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

## పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుత మూర్తి-(హవార్డ్ మర్ ఫేట్ ఆంధ్ర అనువాదం-అమరేంద్ర) | 8-00 | 0-10 |
| 2. | రామకథా రసవాహిని | 9-00 | 0-60 |
| 3. | గీతావాహిని | 3-50 | 0-30 |
| 4. | జ్ఞానవాహిని | 1-50 | 0-10 |
| 5. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 6 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-25 |
| 7. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| 8. | శ్రీ సత్యసాయి భగవల్లీల (ఉప్పాడ రాజారావు) | 1-50 | 0-15 |
| 9. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 10. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 11. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-2[illegible] |
| 12. | సుధాబిందువులు | 5-00 | 0-30 |
| 13 | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 14. | సత్యసాయి వచనామృతం (2) | 4-00 | 0-25 |
| 15. | భజనావళి | 2-00 | 0-20 |
| 16. | భాగవతవాహిని | 3-00 | 0-25 |
| 17. | ఆధ్యాత్మిక బోధిని | 1-00 | 0-10 |
| 18. | బాల వికాస్ బోధిని | 2-00 | 0-20 |
| 19. | నీలగిరి వేసవి వెన్నెల | 2-00 | 0-25 |
| 20. | సందేహ నివారిణి | 2-00 | 0-25 |
| 21. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |
| 22. | ధ్యాన వాహిని | 1-50 | 0-15 |

ఆంధ్ర రాష్ట్రపు, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, వి. వి. సత్యమూర్తిచే

# శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134

పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

**A** (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘానిస్థాన్ | 16 | 26 | | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | | 12 | 9 | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | | 20 | 9 | 20 |
| శ్రీలంక | | 21 | | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసు నందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలెను.

**B**(1) **పుస్తకములు :** ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. **V.P.P.** ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయము నుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

---

( పుస్తక సూచి : 192 వ పుటలో చూడండి )

## శరణార్థులకు చేయు సేవ చాల ఉత్తమమైనది

సత్యము నా స్వభావము. నా కార్యము. నా సందేశము. నా పేరున పని చేయు సంస్థలు సత్యమును పాటించవలెను. మీలోని ప్రావీణ్యము ఇతరుల కుపకరించవలెను. తెవిటి వారికి, అంగ విహీనులకు, మానసిక దుర్బలులకు, అపరాధులకు, అనాథలకు, శరణార్థులకు చేయు సేవ చాల ఉత్తమమైనది. అది గొప్ప సాధనగా ఉపకరించును !

అదే విధముగా కారాగారములలోను, వైద్యశాలలలోను చేయు సేవ, తరచు ఈ ప్రదేశములకు వెళ్ళి వారికి కావలసిన సహాయ సానుభూతుల నందించండి. భజన చేసి వారిలో భక్తి దీపికను వెలిగించండి. వారి ఇండ్లకు జాబులు వ్రాయుటలో సహాయము చెయ్యండి. పుస్తకముల నిచ్చి చదువు కొనునట్లు చేయండి. లేదా మీరే చదివి వినిపించండి. నా అనువారు లేని వారికి మీరే చుట్టముగా నుండండి. నిరాధారులుగా, నిస్సహాయులుగా నున్న వారి జీవితములలో, మీ నిస్వార్థ ప్రేమతో కూడిన మీ చిరునగవు వెన్నెల జల్లులు కురిపించును.

-బాబా